


యస్.వి.యస్. ఫిలిమ్స్

# నిండు మనసులు

నిర్మాత: యం. జగన్నాథరావు * దర్శకత్వం: యస్.డి. లాల్

ఆంధ్ర: జ్యోతి పిక్చర్స్ వైజాగ్: ఉషా ఫిలిమ్సు సీడెడ్: నవభారత ఫిలిమ్సు

JOTHEE

# మీ డబ్బుకు యిదే పరిమాణంగల యితర సబ్బులకంటే, ఎక్కువ సబ్బు-



క్రొత్త రూపం
మలబార్
# గ్లోరి
సబ్బు




- గ్లోరి—లక్షలాది ప్రజలకు ప్రియమైన యీ సబ్బు యిప్పుడు క్రొత్త రూపం పొందింది!
- అంతేకాదు. క్రొత్త రూపంగల ప్రతి "గ్లోరి" కేకుసందు యితర సబ్బులన్నింటి కంటేకూడా యెక్కువగా మీ డబ్బుకు మించిన. సబ్బు. మేలైన సువాసన, నిండుగా నురుగు, పొందగలరు.
- క్రొత్త రూపం "గ్లోరి"ని నేడే కొనండి. ఆ కేకును చూస్తేనే వారు-తప్పకుండా—మొదటి స్పర్శతోనే ప్రేమించేస్తారు.
- గ్లోరి—పురుషుల సబ్బు. దాని మనోహరమైన సువాసన దినమంతా వదలిపోకుండా వుంటూ స్త్రీలకెంతో ప్రీతి కలిగించును.
- గ్లోరి—స్త్రీల సబ్బు-దీని మెత్తని, తెల్లని, ఆహ్లాదకరమైన నిండు నురుగు, యీ సబ్బు యొక్క శ్రేష్ఠతను ఋజువుచేస్తూ, పురుషులను ఆకర్షించేట్లు వుంటుంది.
- గ్లోరి-కుటుంబానికంతకు ప్రియమైన సబ్బు-తమ శరీరం పూరేకులవంటి మెత్తదనాన్ని పొందడంగుర్తించి, పిల్లలందరు యీ సబ్బునేకోరుకొంటారు.



# ఉత్తరాలు

### వ్యాసాలు

9—6—67 పత్రికలో వి. సూర్యారావుగారి వ్యాసం చదివాను. మానసిక శాస్త్రానికి సంబంధించిన వ్యాసాలు వివరంగా రాస్తే అందరికు సులభంగా అర్థం అవుతాయి. ఎలుకకు వంతెన దాటటానికి "అవసరం బలవత్తరంగా ఉండాలి కదా? అటువైపు తిన్డి లక్ష్యమున్నప్పు ఆ అవసరం తీర్చటంకోసమే వంతెన దాటుతుంది. అయితే ఆ ఎలుకకు అలాంటి బలవత్తరపు అవసరం కలగాలి. ఆకలి కల్పించటానికి ఆహారం ఇవ్వకుండా ఉంచవచ్చు. దాహానికి మంచి నీళ్ళు ఇవ్వకుండా వుంచవచ్చు. వ్యాసంలో ఇచ్చిన మాతృవాంఛలి, కుతూహలం, నిరుద్దేశం, కామం, వస్త్రాలకు ఏమి చేయాలి?

కొండిపర్తి భవాని (హైదరాబాద్)

### సీరియల్

నా అభిమాన పత్రికలో మీరు ప్రచురించుచున్న సీరియల్స్ మట్టి బొమ్మలు, పూర్వ సంధ్యా ప్రవర్తతే, రెండూ మంచిరసవత్తరముగా నడుచుచున్నవి. సీరియల్స్ రెండు పాఠకులగారు హృదయాలను ఆకట్టుకొనేవిగా ఉన్నవి. రచించిన వారికి నా అభినందనలు. ఇక ముందు కూడా మంచి సీరియల్స్ వేస్తారని తలంచుచున్నాను.

జి. రమాబాయి (విశాఖపట్నము)

* * *

విద్యను అమూల్యంగా అంటే కొందరి విద్యార్థుల మనస్తత్వమును తమ వృత్తిలోని విశిష్టతను తామే గ్రహించని కొందరి వ్యక్తుల విచిత్ర ప్రవర్తన, చెడును నిర్మూలించి, మంచిని పెంచాలని, ఉత్తమ బాట పడేవారి ఆందోళన, అభివృద్ధి చెందని పల్లెటూరు వారి పద్ధతులు, అభిప్రాయములు, అపోహలు, మొదలగునవి కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించిన శ్రీమతి తేజోవతి అభినందనీయులు.

శ్రీమతి తులసీ వేణుగోపాల్ (హైదరాబాదు)

### కథలు

ఈ వారం (23—6—67) పవిత్ర వారపత్రిక సంచికలో వెలువడిన "రచయిత్రి జీవితం" కథ అత్యద్భుతంగా ఉంది. ఇటీవల కాలంలో ఇంతటి చక్కని కథ వెలువడలేదనడంలో సందేహము లేదు. ప్రతి ఘటనా వాస్తవానికి దగ్గరలో ఉంది. ఇటువంటి ఉత్తమ కథను రచించిన రచయిత్రి "గొల్లపూడి రాజ్యలక్ష్మి" గారిని అభినందించకుండా ఉండలేక పోతున్నాము.

కె. రంగనాథకుమార్ (తాడేపల్లిగూడెం)

* * *

శ్రీ అడవి శివసుబ్రహ్మణ్యంగారి "ఎలా నీకు చెప్పేది" లోని రాజారావు పాత్ర మనస్తత్వ చిత్రణలో కొంత లోపము కనుపిస్తున్నా, మొత్తం మీద కథాగమనము చక్కగా వుంది. కాని అక్కడక్కడ కొంత అసహజత కనుపిస్తుంది. కామేశ్వరి గారి "గురివింద" లో క్రొత్తదనం లేకపోయినా రచనలో వైవిధ్యంవల్ల పాఠకుల్ని ఆకర్షిస్తుంది.

బి. శ్రీనివాసరావు (కర్నూలు)

* * *

23—6—67 పత్రికలో ప్రచురించిన 'రచయిత్రి జీవితం' చాలా బాగుంది. ఆ కథను వ్రాసిన రాజ్యలక్ష్మమ్మగారికి నా ధన్యవాదాలు. ఇటువంటి కథలు వ్రాస్తే చాలా మంచిది. ఒకరి మనస్తత్వాలు ఒకరికి అర్థమవుతాయి.

పూర్వసంధ్యాప్రవర్తతే అను సీరియల్ హృదయాలను కదలించి వేస్తుంది. కథ చాలా సహజంగా పాఠకులను ఆనందింప చేస్తుంది.

జొన్నల జగపతివర్మ (రాజోలు) ●

### గమనిక

గతవారం (7—7—67) ఆంధ్రప్రభ వారపత్రికలో మెదడుకి మేత శీర్షికలోని నీరు, గ్యాస్, విద్యుత్తులో ప్రశ్నలోని బొమ్మ జవాబులో, జవాబులోని బొమ్మ ప్రశ్నలో పొరపాటున తారుమారైనది. పాఠకులు దీనిని గమనించకోరుతున్నాము. —సంపా


హాయిగా వాడటానికి

కేశవర్ధిని

"రెడీ మిక్స్‌డు"

హెయిర్ ఆయిల్

తయారుచేయువారు:

కేశవర్ధిని ప్రాడక్ట్స్,

మద్రాసు - 14.



GP-Z

లాభదాయకం అధునాతనం అయిన చిన్నతరహా కుటీర పరిశ్రమ కొద్ది పెట్టుబడితో ప్రారంభించండి.

కొద్ది పెట్టుబడితో పూర్తి కాలికంగా కాని, సహాయక పరిశ్రమగా కాని లఘు పరిశ్రమ ప్రారంభించ దలచుకున్నవారు 'అధునాతన కుటీరపరిశ్రమలు' అన్న తెలుగు గ్రంథాన్ని (రెండవ ముద్రణ) చదవాలి. లాభదాయకమైన లఘుపరిశ్రమలు, ముడిపదార్థాలు దొరికేచోట్లు, యంత్రాలను వాయిదాల పద్ధతిని తెప్పించుకోవడం, లఘు పరిశ్రమలకు ప్రభుత్వసహాయం వగైరా ఎన్నో విషయాలు దీన్లో వున్నాయి. 960 పుటలు; 350 బొమ్మలు; గుడ్డ బైండ్ ప్రతిధర రూ. 15-50, పోస్టు ఖర్చు రూ. 2-00 ఇతర ప్రతులు: ఇంగ్లీషు. మరాఠీ రూ. 15-50; హిందీ రూ. 16-00. గుజరాతీ, మళయాళం, తమిళం, కన్నడం రూ 13.

COTTAGE INDUSTRY (AWN-61) P. B. 1262 Behind Recruiting office Near Red Fort, Jamuna Road, Delhi-6. Telephone: 262835.

బీహార్ నిస్సహాయ దుస్థితి

వెంటనే పంపండి: (1) డబ్బు, బట్టలు, ఆహార ధాన్యాలను.
(2) వైద్యసహాయానికి వైద్యులను.
(3) మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులకు వాలంటీర్లను

స్వీకరించి పోషించండి: ఒక బిడ్డను, ఒక కుటుంబాన్ని లేక ఒక గ్రామాన్ని.

బీహార్ రిలీఫ్ కమిటీ

సదాకత్ ఆశ్రమ్, పాట్నా-10.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

స్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 14—7—'67
ప్లవంగనామ సం॥ ఆషాఢమాసం శు॥ నవమి
సంపుటము : 59 సంచిక : 44

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి సుకన్య
(ఫోటో: ప్రభాకర్)



అధ్యక్షపదవి
రెడ్డిగార్ల ఆందోళన

మాకు పేలు పొచ్చింది సార్

దుబారా
అసమర్థత
ప్రణాళిక
నకలు
కరువు
ఏనుగుల సంఖ్య దేశంలో విపరీతంగా పెరిగి పోయింది
—వార్త



విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 7

టెక్సాస్ స్కూల్ బుక్ డిపాజిటరీ ఆరవ అంతస్తుపైన పనిచేసేవారంతా ఉదయంఅంతా పనిచేస్తూనే ఉన్నారు. మధ్యాహ్నం విరామ సమయం అయింది. భోజనం అయింతర్వాత ఎదురుగా ఊరేగింపు.

మోటారుకారు ఊరేగింపుని గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి. నీగ్రోల హక్కుల విషయంలో అధ్యక్షుని పట్టుదలకి బుక్ డిపాజిటరీ ఉద్యోగుల్లోఉన్న సానుభూతి అతి స్వల్పం. జాతుల ఏకీకరణాన్ని వ్యతిరేకించే రాయ్ ట్రూలీ 'అది భోజన సమయం కాకుండా ఉన్నట్లయితే సగంమంది పిల్లలు ఊరేగింపు చూడ్డానికి వెళ్ళిఉండే వారు' అని తర్వాత అనుమానపడ్డాడు. 'నీగ్రోలు తప్ప పిల్లలందరూ నా మాదిరిగానే సాంప్రదాయ పక్షీయులు' అని అతను వివరించాడు. అయినా ఊరేగింపు ఊరేగింపే. మధ్యాహ్నానికి పదిహేను నిమిషాలకు ముందే మనుష్యులంతా ఆ భవనపు రెండు పాత ఎలివేటర్లని క్రిందికి చేరుకోడానికి ఉపయోగించారు. వాళ్ళు ఐదో అంతస్తు మీదగా వెళ్తూండగా లీ ఆస్వాల్డ్ తలుపు ప్రక్కన నిలబడి వెళ్ళేవాళ్ళను గమనిస్తూండటం చార్లెస్ గివెన్స్ చూశాడు. అందరూ వెళ్ళింతర్వాత పై అంతస్తులు నిర్మానుష్యమైనాయి.

ఎంత తుపాకీ ధరించినవాడైనా అనుకోకుండా ఎవరో వచ్చి తనను కదిలించవచ్చని, ఆ తర్వాత అతని జ్ఞాపకశక్తి తనను రంగంలోకి లాగవచ్చు విషయాన్ని గట్టిగా చెప్పలేడు. ఆస్వాల్డ్ విషయంలో అదే జరిగింది. సిగరెట్లు మరచివెళ్ళిన గివెన్స్ తిరిగి రావటం, ఆస్వాల్డ్ అతని కంటబడటం జరిగింది. 'ఏమోయి నువ్వు కిందికి రావటంలేదా?' అనడిగాడు ఆశ్చర్యంగా.

'భోజన సమయం అయింది.' 'లేదుసార్' సామాన్యంగా ఎప్పటిమాదిరిగానే నెమ్మదిగా సమాధానం చెప్పాడు ఆస్వాల్డ్.

అనుమానపడకుండా, అంతకంటే ముఖ్యంగా తప్పించుకోడానికి దారిచేసుకునేటందుకు 'మీరు కిందికి వెళ్ళింతర్వాత ఎలివేటర్ గేటు మూసేయండి' అన్నాడు. పడమర వైపున్న ఎలివేటర్ని గేటుకింద మూసి నప్పుడు పైనుంచే పైకి రప్పించుకోవచ్చు అని అతని ఉద్దేశ్యం. 'సరే' అన్నాడు వెనక్కి తిరుగుతూ గివెన్స్. అక్కడే అరగంట తన తుది ప్రయత్నాలలో గడిపాడు ఆస్వాల్డ్.

క్రిందికివెళ్ళిన గివెన్స్ తాను గేటు మూయటం సాధ్యంకాదని తెల్సుకున్నాడు. ఎలివేటర్ అక్కడలేదు, పై అంతస్తులో ఎక్కడో ఉండిపోయింది. దాన్నిగురించిన ఆలోచనలేకుండా గివెన్స్ తనదారిన వెళ్ళాడు. అప్పుడు ఉదయం గం. 11—55 ని.లయి ఉంటుందని అతనికి జ్ఞాపకం.

ఇరవై నిమిషాల అనంతరం రాయ్ ట్రూలీ అతని పిల్లలు డిపాజిటరీ ముందున్నారు. వాళ్ళు మోటారుసైకిళ్ళ దగ్గరవుతున్న శబ్దాన్ని చెవులప్పగించి వింటున్నారు. ఆ సమయంలో ఏ చురుకైన పోలీసు అధికారైనా కిటికీలవైపు పరీక్షగా చూసిఉంటే చరిత్రగతినే మార్చిఉండేవాడు. క్రిందివాళ్ళకు కన్పించేవిధంగా లీ ఆస్వాల్డ్ ఇప్పుడు సరైన స్థితిలో ఉన్నాడు. తుపాకీలగురించి తెలిసిన ఆర్నాల్డ్ రోలాండ్ అనే యువకుడు 12—45 నిం. తన భార్యతో కూడా క్రిందినుంచి గమనిస్తూనే ఉన్నాడు. దూరంగాఉన్న గమ్యాన్నికూడా భేదించగల, టెలిస్కోప్ అమర్చబడిన శక్తివంతమైన తుపాకిని ఆస్వాల్డ్ ధరించి ఉండటం అతను గమనించాడు. అతని చేతులలో ఒకటి ట్రిగర్ మీద, రెండోది బారల్ మీద ఉన్నాయి.

రోలాండ్ కి పన్నెండు అడుగులదూరంలో ఓ పోలీసు అధికారి నిలబడిఉన్నాడు కాని అతనితో మాట్లాడ్డానికి ఆర్నాల్డ్ కి సందర్భం పడలేదు. ఆస్వాల్డ్ అధ్యక్షుని కాపాడుతున్నాడని అతను భావించాడు.

'సీక్రెట్ సర్వీస్ ఏజంట్ ని చూడాలనుందా నీకు?' తన భార్యతో అన్నాడు,

'ఎక్కడ?'

'అదుగో ఆ భవనంలో' అతను చెప్పాడు.

హాబర్ట్ ఎడ్వర్డ్స్, రొనాల్డ్ ఫిషర్ లు 12—20 నుంచీ హూస్టన్ వీధి పడమటి వైపు ఎదురుచూస్తూనే ఉన్నారు. ఉన్నట్లుండి 'అటు చూడు' అంటూ చూపాడు ఎడ్వర్డ్స్. అతనివేలికి సూటిగా తన దృష్టి సారించాడు ఫిషర్. తుపాకీ వారి దృష్టి రేఖకు క్రిందుగాఉంది. అయితే ఎడ్వర్డ్స్ ని ఆకర్షించింది ఆస్వాల్డ్ నిల్చున్న తీరు. వింతగా ఉందని ఫిషర్ ఒప్పుకున్నాడు. వాళ్ళకు కన్పించిన ఆస్వాల్డ్ తేరుగా కాకుండా తన కుడివైపుకు చూస్తున్నాడు. 'అతనిలో చలనం లేదు. శిలా విగ్రహంలా రెప్పవేయకుండా చూస్తున్నాడు' అన్పించింది ఫిషర్ కు.

రహస్యసమాచారంవల్ల బయటపడ్డ సాక్ష్యం హోవార్డ్ బ్రెన్నన్. ఆస్వాల్డ్ కి దిగువ 40 గజాలలో బ్రెన్నన్ ఎండలో వేచిఉన్నాడు. నుదుటిమీది చెమటను తనకాకీ చొక్కా చేతులతో తుడుచుకుని డిపాజిటరీ పైనున్న ఉష్ణోగ్రత, కాలాన్ని తెలిపే గుర్తువైపు నిశితంగా చూశాడు. అది అతనికి చాటయిందికాని అతనిదృష్టి అరవ అంతస్తుపై పడింది. శ్రమను వ్యక్తం చేస్తున్న ఆస్వాల్డ్ ముఖం పార్శ్వకోణంలో కన్పించింది. ఎందు కతడక్కడున్నాడని అతను కూడా ఆశ్చర్యపడ్డాడు.

మెయిన్ స్ట్రీట్ నుంచి దూరంగా కోలాహలం విన్పించింది. తమకు కన్పించిన వింత ఆకారంగురించి బ్రెన్నన్, రోలాండ్, ఎడ్వర్డ్స్, ఫిషర్ లు మరచిపోయారు. 'అదిగో వస్తోంది' ఆవేశంగా అన్నాడు ఎడ్వర్డ్స్.

ఆస్వాల్డ్ నిగురించిన పరిశోధన సంస్థలో ముఖ్యుడైన ఎఫ్.బి.ఐ.ఏజంట్ జిమ్ హాస్టి ఆటంకాలనుంచి కెన్నెడీని పరిరక్షిస్తూవచ్చి 12—12—కి భోజనంకోసం అలమో గ్రిల్ లో అడుగుపెట్టాడు.

12—28కి మోటారుకారు ఊరేగింపు మెయిన్ లోఉన్న మార్కెట్ ని సమీపించింది.

యార్బరోకి జరిగినట్లు పై అంతస్తు నుంచి ఎవరైనా పూలకుండీని కెన్నెడీ తలమీద పడేయవచ్చనుకున్నాడు సెనెటర్.

తాము అయిదు నిమిషాల్లో అక్కడికి చేరనున్నట్లు వాషింగ్టన్, ఎల్మ్ లవద్ద వైర్ లెస్ లో ట్రేడ్ మార్ట్ కి చెప్పాడు ఏజంట్ సోర్ల్స్. ఏజంట్ లాసన్ తమ కెదురుగా దారిలో పనిచేస్తున్న రైల్వేపనివాళ్లనుచూసి వెంటనే వో పోలీస్ అధికారికి దారి సరిచేయ్యవలసిందిగా సంజ్ఞ చేశాడు కానీ ఆ అధికారినుంచి సమాధానంలేదు. అతనికది అర్థంకాలేదు.

ఏజంట్ గ్రీర్ కష్టమైన ఒక మలుపు తీసుకుని తేలిగ్గా ఊపిరితీసుకోడం మొదలు పెట్టాడు. అతని శ్రమ తగ్గింది. అప్పుడు అతనుకూడా ఆపనివారినిచూసి కలవరపడి. పరిచయంలేని ఆ వీధివంక ఒకసారి జాగ్రత్తగా చూశాడు. అవసరమైతే క్షణకాలంలో అధ్యక్షుని అవతలికి తీసికెళ్లడానికి సాధ్య పడుతుందా లేదా అని అతను పరిశీలించాడు. లింకన్ అక్కడి దేవదారువృక్షాన్ని దాటుతూ ఉంది. అదేసందర్భంలో ఆరవ అంతస్తులోని మూలగాఉన్న గది కిటికీవద్దఉన్న తుపాకి గొట్టం అధ్యక్షునికి క్షణం ఎదురుగా ఉంది. అధ్యక్షునికారు — సీక్రెట్ సర్వీస్ కోడ్ లో ఎస్. ఎస్. 100 ఎక్స్—ను ఫోటో తీస్తున్నాడు జప్రూడర్.

'దాదాపు మనం వచ్చేసినట్లే అది దాటగానే' అంది నెల్లి జాకీతో.

'ఆ సొరంగ మార్గం ఎంత చల్లగా ఉంటుందో' అనుకుంది జాకీ, అక్కడ అంతా ఎంతో ప్రశాంతంగా ఉన్నట్లే అనిపించింది.

'గమ్యాని కింకా అయిదునిమిషాలుంది' అని చెప్పి, '12—35కి అధ్యక్షుడు కెన్నెడీ ట్రేడ్ మార్ట్ కి చేరుకున్నాడు' అని తను రాసుకున్నాడు.

వేరెన్ హౌస్ మీదున్న గుర్తుని వేరే విధంగా అర్థంచేసుకున్న మెక్ కిండిఫ్ 'చెత్త ఆ డిపాజిటరీ ఏమిటి' అన్నాడు వాషింగ్టన్ విలేఖరి మెర్రిమాన్ స్మిత్ తో. మోటారు కారు ఊరేగింపుకు యింకా వెనక ఉన్న ఇవెలిన్ లింకన్ 'చూడండి మనం డల్లాస్ అంతా దాటి వచ్చాం కానీ ఏవిధమైన ప్రదర్శన లేదు' అంటున్నాడు.

గంటకు 11.2 మైళ్ళ వేగంతో వెళ్తున్న లింకన్ చెట్టుని దాటింది. కానీ ఆరవఅంతస్తులోఉన్న కిటికీనుంచి మాత్రం తప్పిపోలేదు. కారు చివరికొమ్మనికూడా దాటేసింది.

ఊరేగింపు చూస్తున్న చార్లెస్ బ్రెండ్ అనే అతని అయిదేళ్లకొడుకు బెరుకుగా చెయ్యెత్తాడు. అధ్యక్షుడు చిరునవ్వు నవ్వాడు. తిరిగి చేయి ఊపడానికి చెయ్యెత్తాడు. అంతే పెద్దధ్వని అకస్మాత్తుగా వినిపించింది.

మోటారుకారు ఊరేగింపులో ఉన్న వేటగాళ్ళలో చాలామంది దానిని తుపాకి పేలిన శబ్దంగా పసికట్టారు. కానీ వైట్ హౌస్ బృందం మాత్రం తికమకపడింది. సీక్రెట్ సర్వీస్ ఏజంట్లు కెల్ ఎర్ మన్, లాసన్, గ్రీర్, రెడీ, హిల్ లు మాత్రం అదేదో టపాకాయ పేలుడని అనుకున్నారు,

మెడను చేతితో కప్పి ముందుకు వాలిగిన అధ్యక్షుని చూసిన క్లింట్ హిల్ అసాధారణంగా చలించిపోయి ఎస్. ఎస్. 100 ఎక్స్ వైపు వచ్చాడు. మొదటిసారి ప్రేలుడు విన్న తర్వాత అధ్యక్షునికి దగ్గరో ఉన్న ఏజంట్ల ముఖకవళికలు ఆ క్షణాల్లో చాలా కఠినంగా రూపొందాయి. కానీ అధ్యక్షుని అంగరక్షకులు వాటిని పట్టించుకోలేదు.

(10వ పేజీ చూడండి)



తన యిద్దరు పిల్లలతో శ్రీమతి జాక్విలిన్ కెన్నెడీ

# లివ్ అండ్ లెట్ డయ్ - 3

## జేమ్స్‌బాండ్ బొమ్మల సీరియల్










నేనూ, లీటర్ మిస్టర్ బిగ్ కోసం హార్లెమ్‌లో వెదుకుతూనే ఉన్నాం. అప్పుడు.....

వాళ్లు బోన్‌యార్డ్ వైపొస్తున్నారు. జడ్ టేబిల్ వాళ్ల కివ్వండి.

పొరపాటైపోయింది. ఇద్దరు అతిముఖ్యమైన ఖాతాదార్లకు ప్రత్యేకించినది ఈ టేబిల్...













అదృష్టం బాగుంటే మనం మిస్టర్ బిగ్‌ని ఇక్కడ పట్టొచ్చు.
ప్రదర్శనానంతరం అనుకుంటా

ప్రదర్శన పరాకాష్ఠ నందుకుంది..
... ఉన్నట్టుండి దీపాలారిపోయాయి...
ఏమయింది ?
ఫ్యూజ్ అయి ఉంటుంది.
హే ! బస్టర్ యిచ్చెయి.
ఆ చచ్చాను.

... క్రింద ఒక మీటను లాగారు.










హార్లెమ్ నైట్‌క్లబ్ చీకటి మయమై పోగా నేనూ లీటర్ ఉన్న జడ్ టేబిల్‌నాతోపాటు నేలలోకి క్రుంగిపోవడం మొదలైంది.

తేలిగ్గా తీసుకోండి అబ్బాయిలూ. దాడి అనందంగా ఉందా?

ఆ ఇంగ్లీష్ వ్యక్తి తుపాకి తీసెయి. బాస్ అతన్ని చూడాలనుకుంటున్నారు




వెంటనే మేము పోట్లాటకి దిగాము.

మీ ఊపిరిని వృథా చేసుకోకండి. మిస్టర్ బిగ్ మీ కోసం ఎదురు చూస్తున్నారు.

నీ స్నేహితుడికి గుడ్‌బై చెప్పెయ్యవచ్చు




జాగ్రత్తగా కనిపెడుతూ నన్ను మిస్టర్ బిగ్‌ని కల్సుకునేందుకు తీసికెళ్లారు.

గుడ్ మార్నింగ్ మిస్టర్ జేమ్స్‌బాండ్. కూర్చో.

నీకు వేరే ఉద్దేశ్యం ఏదైనా ఉన్నట్లయితే ముందుకు వంగి నీకు ఎదురుగా ఉన్న డ్రాయర్‌కి ఉన్న తాళం చెవి కన్నం నువ్వు గమనించాల్సి ఉంటుంది. కాలితో మీటనునొక్కితే పేలే తుపాకి దాంట్లో అమర్చుంది.




నువ్వు సీక్రెట్ సర్వీస్ ఏజంట్‌వని నాకు తెలుసు మిస్టర్ బాండ్. నీ నెంబర్ 007 అని కూడా తెల్సు. అంటే నీకు చంపడానికి అధికారం ఉంది. నువ్విక్కడెందుకున్నావో నాకు తెలీకుండా ఉంది. చెప్తావనుకుంటా.

ఇంగ్లీష్ బంగారు నాణాలు హార్లెమ్‌లో చెలామణీ కావటానికి మూలమైన దాన్ని అరికట్టడానికి నేను అమెరికాలో ఉన్నానని నా కథని వివరించాను.

ఇప్పుడు నేను నీ కథలోని నిజం ఎంతో పరీక్షిస్తాను.

మిస్ సాలిటైర్‌ని లోపలికి పంపించు.

(ఇంకా ఉంది)

# లోకంపోకడ

హిందీ—ఇంగ్లీషుభాషావాదంమీద ప్రభుత్వ తత్వం మారనంతవరకు ఏ బిల్లూ సంతృప్తికరంగా తయారు చేయలేరు. నిలబడి కబుర్లు చెప్పడం సులభంకాదు, పవిత్రమైనదీ కాదు. పారిశుద్ధ్యం, స్పష్టత బిల్లుల రచనకు ప్రధానం గనక ప్రభుత్వానికీ, బిల్లులకీ పొసగదు.

—శ్రీ సి. రాజగోపాలాచారి

—స్వరాజ్య (24—6—67)

* * *

ప్రజల్లో బాగా పలుకుబడి సంపాదించుకో డానికి, భవిష్యత్తులో ఎక్కువ పదవులకోసమూ, నేరమంతా కేంద్రంమీద మోపి ప్రజలు నమ్మేట్లు చేస్తుంది డి. యమ్. కె.

— స్టేట్స్‌మన్ (29—6—67)

* * *

జూన్ 16 శుక్రవారం సాయంత్రం నాలుగునుంచి తొమ్మిది గంటలదాకా భారత దేశం ప్రపంచాన్నుంచి తెగిపోయింది. అన్ని వార్తా సౌకర్యాలూ స్తంభించిపోయాయి. ఎందుకు......? చైనా ఎంబసీ ముందు భారతీయుల ఆందోళన పురస్కరించుకుని!

—ఆర్గనైజర్ (25.6.67)

* * *

కష్టంలో ఎంతయితే మంచివుందో, ఆ పన్ను మంచి అంతటికీ వారసులు మనుష్యులే.

—బ్లిట్స్ (1—7—67)

* * *

ప్రధానమంత్రి నిజలింగప్పకు సర్వ టింపదానికి అయిన ఖర్చుతో లక్షమంది ఆకలి తీరేది.

ఒక జనసంఘ్ ఎమ్మెల్యే

—కరెంట్ (1—7—67)

* * *

ఇండియాకి ఎప్పుడూ తగినంత తెలివి తేటలు ఉన్నాయికానీ 'పక్షి త నాయకత్వమే ఉండటంలేదు?' అని శ్రీ ఎల్. మహావీర్‌గాంధీ ఒక వార్త పత్రికా విలేఖరితో అన్నారు.

—స్టేట్స్‌మన్ (23.6.66)

# అధ్యక్షుని మరణం

(7 వ పేజీ తరువాయి)

ఉపాధ్యక్షుని కారులోఉన్న యార్బరోకి తుపాకి మందువాసన తగిలింది. 'మై గాడ్! వాళ్ళు అధ్యక్షుని కాల్చారు!' ఏజెంట్ రూఫస్ యంగ్‌బ్లడ్ ముందు సీట్లోకి జాన్సన్ వైపుకు దొర్చుకొచ్చాడు. అతను తాను కన్పిస్తున్న దానికంటే తక్కువ నిబ్బరాన్ని కలిగిఉన్నాడు. తాను చెప్పింది నిజం కాకపోతే ఇది మరింత సంకటప్రాయంగా తయారవు తుందని అతనను కున్నాడు. కానీ అతని స్వరం పెద్దగానే విన్పించింది. 'దిగండి' జాన్సన్‌తో అన్నాడు.

అతిముఖ్య వ్యక్తులున్న బస్‌లో డాక్టర్ బర్క్లీ కిటికీలవైపు రెప్పవేయ కుండా చూస్తున్నాడు. అధ్యక్షుని వైద్యుడికి మాత్రం ఏమీ వినిపించలేదు. అతను మోటారుకారు ఊరేగింపుకి చాలా వెనకగా ఉన్నాడు.

అధ్యక్షుడు గాయపడ్డాడు కానీ తీవ్రంగా మాత్రం కాదు. 6.5 మిల్లీమీటర్ల తుపాకీగుండు ఆయనమెడ వెనుకభాగంకుండా కుడి ఊపిరితిత్తిని ఒరుసుకుంటూ, గాలి గొట్టాన్ని చీల్చుకుని ముందు టై ముడి వద్ద మెడలోనుంచి బయటపడింది.

పాత కార్నెల్ గ్రాడ్యుయేట్ విద్యార్థి ఒకతను 1966 లో ప్రచురించినదానిలో మొట్ట మొదటి గుండు వేరే మార్గంలో దూసుకువెళ్ళిందని సూచించాడు. రెండో హంతకుడు ఆస్వాల్డ్‌కి సహాయపడ్డాడన్న దానిని అది విశదం చేస్తుంది. తర్వాత అధ్యక్షుని శరీరంపై జరిపిన పరీక్షలవలన ఆ సమస్య పరిష్క రింపబడింది. 1971 వరకూ ఈ విష యాల్ని పెద్ద శాస్త్రవేత్తలకు కూడా చూపించటం అంత బాగుండదని రాబర్ట్ కెన్నెడీ భావించాడు. ఆ నిబంధనలోనే దానికి ప్రాపిన పత్ర భద్రతాగృహానికి పంపాడు. ఈ రచయిత దానిని చూడకపోయినప్పటికీ, సీలు వేయకముందు దానిని పరీక్షించిన, ప్రత్యేకార్హతలున్న ముగ్గురు వ్యక్తుల్ని కలుసుకున్నాడు. వారిలో ఎవరూ మిగతా వారికి తెలీదు. కానీ తాము చూసిన ఫొటోలు, ఎక్స్‌రేల గురించి యిచ్చిన వివరాలు మాత్రం ఒకేలా ఉన్నాయి.

ఆ గ్రాడ్యుయేట్ విద్యార్థి వాదించినట్లు భుజానికి క్రిందిభాగంలో గుండు లోపలికి ప్రవేశించిన గుర్తు ఏదీ ఎక్స్‌రేలలో కన్పించ లేదు. కొన్నిసమయాల్లో ఎక్స్‌రేని పరీక్షించి కనిపెట్టటంకూడా కష్టసాధ్యమే. ఏది ఏమైనప్పటికీ ఫొటోలుమాత్రం మెడ క్రింది భాగంలో గాయం ఉందని నిస్సందేహంగా వెల్లడి చేస్తున్నాయి. చివరికి అధ్యక్షుని వైద్యునితో సహా అధ్యక్షుని శరీరాన్ని పరీక్షించిన డాక్టర్లంతా ఈ ప్రత్యక్ష నిదర్శనాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

అక్కడ్నుంచి తుపాకి గుండు గవర్నర్ కానల్లీ వీపు, ఛాతీ, కుడిమణికట్టు, ఎడమ తొడకుండా దూసుకు పోయింది. దాన్ని గురించి తెలీకుండానే గవర్నర్ కానల్లీ అలవ్యంగా బాధను వెలిబుచ్చాడు. ఏజ్ ఫ్రూడర్ అధ్యక్షుని ముఖకవళికల్ని చూసి ఆశ్చర్యపోయాడు. నెల్లీకానల్లీ తనసీట్లో మంచి కదిలి అధ్యక్షుని పరీక్షగా చూసింది. అతనిచేతులు మెడవద్ద ఉన్నాయి కానీ విశ్వ తంగామాత్రం లేడాయన. కొద్దిగా వొరిగి పోయాడు.

'మైగాడ్! వాళ్ళు దెబ్బ తీశారు' అని ఉచ్చరించటం తాను విన్నానని రాయ్ కెల్లర్‌మేన్ అనుకున్నాడు. అతను ఆయన ఎడమభుజంవైపు చూశాడు. గ్రీర్ కుడిభుజంవైపు చూస్తున్నాడు. కారు ఒకప్రక్కనుంచి యింకొక ప్రక్కకుపోతూ నెమ్మదిగా మార్గంనుంచి బయటపడింది. ఇద్దరూ కెన్నడీ దెబ్బ తినటం చూశారు.

ఇదే సమయంలో జాన్‌కానల్లీకి తన గాయం కన్పించింది. అతను ముందుకి వంగి తొడ రక్తసిక్తమై ఉన్నట్లు గమనించాడు. అతను తన భార్యవైపు వాలిపోయి ఉన్నాడు.

ఉన్నట్టుండి గవర్నర్‌కి బాధ తెల్సింది. భయవిహ్వలుడై 'వద్దు, వద్దు, వద్దు, వద్దు, వద్దు' అంటూ 'వాళ్ళు మమ్మల్నిద్దర్నీ చంపుతారు' అని కేకలు వేశాడు.

అత నెందుకలా అరుస్తున్నాడోనని ఆశ్చర్యపడ్డది జాక్విలిన్ కెన్నెడీ. అంతకు ముందే ఆమె తన భర్తవైపు ఆత్రంగా దృష్టిని సారించింది. గ్రీర్ చక్రంవంక తిరిగి చూశాడు. కెల్లర్‌మన్ అతని భుజాల వైపు మరోసారి చూశాడు. ఎవరిలోను

# ఇటుక బరువు



(క) ఇటుక బరువు:

త్రాసులో ఒక వైపున ఇటుక, రెండో వైపున ఇటుకలో ముప్పాతిక భాగము + ముప్పాతిక కిలో రాయి ఉంచితే తూకం సరిగ్గా సరిపోయింది.



అయితే ఆ ఇటుక బరువు ఎంత? త్వరగా కోటివి చెప్పాలి ... అబ్బ! ఇంత ఆలస్యం అయితే ఎలా!

# బొమ్మ బొరుసు



(ఖ) బొమ్మ—బొరుసు.

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

రంగడు మరొకడితో కొత్తరకం జూదం మొదలు పెట్టేడు. ప్రతిసారీ తన దగ్గర ఉన్న డబ్బుతో సగం పందెం కాస్తాడు. రూపాయి ఎగరేసి బొమ్మపడితే రంగడు నెగ్గినట్లు, బొరుసుపడితే ఓడిపోయినట్లు లెక్క.

బొరుసుపడి రంగడు ఓడితే అతడు పందెంకాచిన డబ్బు అంతా ఎదుటివాడికి పోతుంది. బొమ్మపడి నెగ్గితే, రంగడు పందెం కాచినంత డబ్బును ఎదుటివాడు రంగడికి ఇచ్చుకోవాలి. న్యాయమే కదా! ఈ ఆట ఎంతసేపు ఆడేరో, ఎన్నిసార్లు రూపాయి ఎగరేశారో మనకు తెలియదుగానీ, సరిగ్గా సగం సార్లు బొమ్మ, సగం సార్లు బొరుసు పడిందట. అయితే ఈ ఆటవల్ల రంగడికి లాభమా? నష్టమా?

* * *

# అన్నదమ్ముల వాటాలు



(గ) అన్నదమ్ముల వాటాలు:

ఒక భాగ్యవంతుడు తన నలుగురు కొడుకుల కోసమని గుండ్రటి ఎస్టేటులో నాలుగు ఇళ్లు కట్టేడు. అతడు చనిపోయాక, అతని పిల్లలకు పెళ్లిళ్లయ్యాక, వాళ్లల్లో వాళ్లకి స్పర్థలు పెరిగిపోయాయి. ఆ ఎస్టేటును నాలుగు సమ భాగాలుగా



చేసి, పంచుకోవాలన్నారు. వైశాల్యం పరంగా మాత్రమే కాదు, నాలుగు భాగాలూ ఒకే ఆకారంతో ఉండాలని పట్టుపట్టేడు వారిలో ఒకడు. అది ఎలా సాధ్యమో మీకు తెలిస్తే చెప్పి పుణ్యం కట్టుకోండి.

* * *

# ఆరు కోణాల ముగ్గు



(ఘ) ఆరుకోణాల ముగ్గు:



ఇక్కడి బొమ్మలో [illegible] ఒక్క ఒకటే చూపబడింది గీతలు ఖండించుకునే 12 బిందువుల దగ్గరా పన్నెండు చింత గింజలు ఉన్నాయి. చింతగింజలను ఈ విధంగా అమర్చడం వల్ల వరుసకు నాలుగేసి గింజల చొప్పున ఆరు వరుసలు ఏర్పడ్డాయి.

వీటిలో నాలుగు గింజలను మాత్రం జరిపి మరోచోట ఉంచి, వరుసకు నాలుగేసి గింజల చొప్పున ఏడువరుసలు ఏర్పడేలా చేయగలరా?

* * *

## జవాబులు

(క) ఇటుకలో నాలుగో వంతు భాగం $\frac{3}{4}$ పౌనుకి సమానం అయింది. అంటే పూర్తి ఇటుక బరువు 3 పౌనులు అన్నమాట

* * *

(చ) బొమ్మలూ, బొరుసులూ సమాన సంఖ్యలో పడ్డాయి కనుక లాభనష్టాలు లేవు అనుకుంటున్నారా? కాదు, కాదు ఈ జూదంలో రంగడు చాలా నష్టపోయి ఉంటాడు!

ఒకసారి నెగ్గి, మరొకసారి ఓడిపోతే (నెగ్గడం, ఓడడంలో ఏది ముందర జరిగినా ఒకటే) అతడి దగ్గర తెచ్చుకున్న డబ్బులో $\frac{3}{4}$ వ వంతు మిగులుతుంది

నాలుగుసార్లు ఆడితే (రెండు బొమ్మలు, రెండు బొరుసులూ అయితే) అతని దగ్గర మొదట తెచ్చుకున్న డబ్బులో $\frac{9}{16}$ వ వంతు మిగులుతుంది. ఆరుసార్లు ఆడితే (3 బొమ్మలూ, 3 బొరుసులూ ఏ వరుసలో పడినా ఒకటే) అతని దగ్గర మొదట తెచ్చుకున్న డబ్బులో $\frac{27}{64}$ వ వంతు మిగులుతుంది 8 సార్లు ఆడితే (4 బొమ్మలూ, 4 బొరుసులూ, ఏ క్రమంలో పడినాసరే) అతని వద్ద మొదట తెచ్చిన డబ్బులో $\frac{81}{256}$ వ వంతు మిగులుతుంది ఈ విధంగా ఎన్నిసార్లు ఆడితే అంత అధికంగా అతడు నష్టపోతాడు.

* * *

(ఛ) దీనిని అనేక విధాలుగా సాధించవచ్చు.




ఐదురకాల పద్ధతులు మనకి ఇక్కడి బొమ్మలో చూపబడ్డాయి.

* * *

(జ) 2, 5, 9, 10 స్థానాలలో ఉన్న చింత గింజలను తీసి ఇక్కడి బొమ్మలో చూపినట్లు ఉంచి వరుసకు నాలుగేసి గింజల చొప్పున ఏడువరుసలు ఏర్పడుతాయి.



తొలగించిన గింజల స్థానాలను గీతలు గల సున్నలతోనూ. వాటి మారిన స్థానాలను నల్లని సున్నలతోనూ సూచించాను.

చిలిపిచూపుల చిన్నారిపాప — ఫొటో: బ్రహ్మదేవ్

# రాణీ చాంద్ బీబీ

'అహ్మద్‌నగర్ కోటలో నన్ను కొంత కాలం ఖైదు చేశారు. ఆ కోట చరిత్ర ప్రసిద్ధమైన కోట. అందమైన చాంద్‌బీబీ సాహసం గురించి అహ్మద్‌నగర్ కోట ఈ నాటికీ చెప్తూ వుంటుంది. కత్తి చేత పట్టుకుని, అనంతమైన అక్బరు సైన్యానికి ఎదురు నిల్చి కోటను రక్షించడానికి దీక్షా కంకణం కట్టుకున్న వనిత 'చాంద్ బీబీ.'

—'డిస్కవరీ ఆఫ్ ఇండియా'—జవహర్లాల్ నెహ్రూ.

[ఢిల్లీ చక్రవర్తి తుఘ్లక్. అతని సైన్యాధిపతి హసన్‌గంగు. హసన్ గంగుకు ఒక జాగీరు ఇచ్చి తుఘ్లక్ అతన్ని దక్కన్‌లో ఉండమన్నాడు. 1347 లో హసన్‌గంగూ బహ్మనీ రాజ్యాన్ని స్థాపించుకొని స్వతంత్రంగా రాజ్యం చేయసాగాడు. పదిహేనవ శతాబ్దంలో బహ్మనీరాజ్యం అయిదు భాగాలుగా విడిపోయింది. బీజ్‌పూర్, అహ్మద్‌నగర్, బీరార్, గోల్కొండ, బీదర్ విడిపోయిన రాజ్యాలు. 1560 లో బీజ్‌పూర్ సుల్తాను అలీ ఆదిల్షా చాంద్ బీబీని వివాహం చేసుకున్నాడు.]

'నా ప్రియమైన రాణీ, చాంద్! నువ్వు నా భార్యవు కావడం, అది నా అదృష్టం. నీతోపాటు షోలాపూర్ కోటను భరణంగా పొందాను. దక్కనులోని కోటలన్నిటికంటె అది పటుతరమైందని అందరికీ తెలుసు. నీ ధైర్యసాహసాలముందు ఈ కోటలు, సైన్యమూ అంతా ఎందుకూ పనికిరానివని నాకు తెలుసు. దేవుడు కరుణించి నీలాంటి భార్యను నాకు ప్రసాదించాడు.'

—అలీ ఆదిల్షా.

[1579లో అలీ ఆదిల్షా మరణించాడు. అప్పటికే బీజ్‌పూర్‌లో చాంద్‌బీబీకి అగణితమైన పేరు ప్రఖ్యాతులు వచ్చేశాయి. ఆమె తెలివితేటలు, శక్తియుక్తులు ప్రజల్ని బాగా ఆకర్షించాయి. ఆమె అనేకసార్లు భర్తతో పాటు యుద్ధరంగాలకు వెళ్ళింది. పోరాటాల్లో పాల్గొన్నది. వేటలో పాల్గొంది. ప్రజల కష్టసుఖాల్లో పాలుపంచుకున్నది. న్యాయస్థానాల్లో ఆమె తీర్పు అమోఘమైనది. అంతటి ప్రతిభగల రాణిని ఎవరు గౌరవించకుండా వుంటారు?]

'నా భర్తను పోగొట్టుకుంటానని నేనెప్పుడూ కలనైనా కనలేదు. మా వివాహ జీవితం ఇంత తొందరగా పరిసమాప్తమైపోతుందని ఎప్పుడూ ఊహించలేదు. దేవుడు నాకు సంతానాన్ని కరుణించలేదు. అయినా మేనల్లుడు ఇబ్రహీం ఉన్నందుకు కొంత మేలే అయింది. నా మేనల్లుడికి యుక్తవయస్సు వచ్చే వరకు ప్రజల్ని కాపాడడం నా బాధ్యత. కరుణామయుడయిన నా భర్త నామీద ఈ పవిత్రమైన బాధ్యతను అప్పగించారు.'

—చాంద్‌బీబీ.

[అప్పటికి బీజ్‌పూర్ చాలా భయంకరంగా వుండేది. ఎక్కడ చూసినా అల్లర్లూ, అధికారాలు రేగుతూ వుండేవి. అంతటి సువిశాలమైన రాజ్యంలో క్షోభ చెలరేగడంతో, దానిని అణచడానికి చాంద్‌బీబీకి ఎంతో కష్టసాధ్యమయింది. పైగా పర రాజ్యాల పీడ ఉండనే వుంది. వారు సమయం కోసం ఎప్పుడూ ఎదురుచూస్తూ వుండేవారు. అన్ని అపాయాల్ని సూక్ష్మ దృష్టితో గ్రహించిన చాంద్‌బీబీ ఎంతో అప్రమత్తతగా వ్యవహరిస్తూ వుండేది.]

'బీరార్‌ను హస్తగతం చేసుకోవడానికు శత్రువులు మీదిమీదికి వస్తున్నారు. వారిని ఎదుర్కోడానికి తగిన శక్తిని ప్రసాదించు భగవంతుడా! బీరార్, బీదర్, గోల్కొండ రాజ్యాలు ఒక్కుమ్మడిగా విరుచుకు పడుతున్నాయి. బీజ్‌పూర్‌ను రక్షించు తండ్రీ!'

—చాంద్‌బీబీ

[ఏకమై వచ్చిన మూడు రాజ్యాల సైన్యాలు బీజ్‌పూర్‌ను ముట్టడించాయి. సైన్యాన్ని చెండాడడానికి చాంద్‌బీబీ శాయశక్తులా పోరాడుతున్నది. అంతటి మహా సైన్యాన్ని ఎదుర్కోడానికి ఆమెవద్ద చాలా తక్కువ సైన్యం మాత్రమేవుంది. అయినా ధైర్యంతో పోరాటం సాగించింది. వర్షం పడుతున్నా, రక్తం కారుతున్నా లెక్కచేయకుండా అలా ఎన్నోరోజులు యుద్ధంచేసింది. సైన్యాన్ని పురిగొల్పింది. హెచ్చరించింది. తాను ముందుండి సైన్యానికి ఉత్సాహాన్నిచ్చింది. రాత్రింబవళ్ళు సదా హుషారుగా వుండి కోటను రక్షించడానికి తగిన పర్యవేక్షణ తీసుకున్నది. ఆమె సాహసం పగవారిని సైతం ఆశ్చర్యంలో ముంచివేసింది. ఆమె



ప్రోత్సాహంతో రెండువేల సైన్యం ఒక్కసారిగా విరక్తైవేలయింది. ఒక సంవత్సరం పాటు కోటను రక్షించింది.]

'పూజనీయులైన అత్తయ్యా! ఢిల్లీ చక్రవర్తి అక్బరు అమితమైన సైన్యంతో అహ్మద్‌నగర్ మీదికి దండెత్తి వస్తున్నాడు. ఇటువంటి ఘోరమైన విపత్తును దాటించడానికి నా తండ్రి లేకపోయినందుకు ఎంతో విచారిస్తున్నాను. అనుభవంలేని నేను ఒక్కడినీ ఎలా నిలద్రొక్కుకోగలుగుతాను? ఈ రాజ్యాన్ని రక్షించవలసిన బాధ్యత నీమీద ఉంది.'

'అహ్మద్‌నగర్ సుల్తాను, చాంద్‌బీబీ మేనల్లుడు' —ఇబ్రహీం.

[అప్పటికి చాంద్‌బీబీ వయస్సు యాభై సంవత్సరాలు. ఆమె జీవితకాలమంతా యుద్ధాల్లో వ్యర్థపుచ్చింది. ఇప్పుడు హాయిగా విశ్రాంతి తీసుకోవలసిన వయస్సు. మత సంబంధమైన చర్చలతోను, దైవకార్యాలతోను కాలం వెళ్ళబుచ్చాలని నిశ్చయించుకున్నది. ఇప్పుడు మేనల్లుడి ఉత్తరం ఆమెను పోటీకి అతీతురాలిని చేసింది. కర్తవ్యం నిర్వహించడానికి, అహ్మద్‌నగర్‌లో తన వంశాన్ని నిలబెట్టడానికి పూనుకున్నది.]

అహ్మద్‌నగర్ కోటను రక్షించడానికి చేత కరవాలము, శరీరానికి కవచాన్ని ధరించి చాంద్‌బీబీ రణరంగంలో ఉరికినప్పుడు సైన్యం ఒళ్ళు గగుర్పొడిచింది. రేకెత్తిన ఉత్సాహంతో సూర్యోదయం లగాయితు సూర్యాస్తమయం వరకు ఘోరమైన పోరాటం సాగింది. మొండాలు తుండాలుగా సైన్యం చెల్లాచెదరుగా పడిపోయింది. చాంద్‌బీబీ కంఠం దశదిశలా ధ్వనించింది.'

- ఫరిష్టా.

[ఎంతశక్తితో పోరాడినా చాంద్‌బీబీకి అపజయమే ఎదురైంది. నమ్మకద్రోహంతో ఆమెను శత్రువులు వంచించారు. శత్రు సైన్యంలోని ఒకడు కోటలో ప్రవేశించి చాంద్‌బీబీని హత్యచేశాడు. ఆమె పవిత్రమైన జీవితం అంతటితో సమాప్తమయింది. చరిత్రలో ఆమె జీవిత విశేషాలు సువర్ణలిఖితమయినాయి.]

'ఎలిజబెత్ రాణితో సరిసమానమైన ప్రతిభ చాంద్‌బీబీలో వున్నదని; ఆమె రాజకీయ చతురత, పరిపాలనా దక్షత అంతటి విమర్శనమయినదని ఇంగ్లండులో ఏ కొద్ది మందికో తెలిసివుంటుంది. చాంద్‌బీబీ తెలివితేటలు, ధైర్యస్థైర్యాలు సాటిలేనివి. ప్రజలు ఆమెను ప్రేమించిన తీరు, ఆమె పరిపాలనలో ఘనతకు నిదర్శనం. నిరాడంబరము, దయ, ధర్మగుణం, మతానురక్తి— ఇవి చాంద్‌బీబీ ఆభరణాలు. భారతదేశ స్త్రీ లోకానికి ఆమె మణిపూస. వెలలేని రత్నం!'

—కలనల్ మీడోస్ టేలర్.
(అతని చరిత్ర గ్రంథంలో)

—వి. సు.


ఐటెక్స్ సౌందర్య సాధనములు
ఐటెక్స్ కాటుక
ఐటెక్స్ బిందీ
కుంకుం చాందు
ఐటెక్స్






ARAVIND LABORATORIES, P. B. 1415. MADRAS-17.



ఇంజనీరింగ్ కోర్సులలో ప్రవేశము

మెట్రిక్, హైయర్ సెకండరీ, ఇంటర్‌మీడియట్ చదివినవారికి
గ్రాడ్యుయేట్లకు లోకల్ మరియు పోస్టుద్వారా శిక్షణ యివ్వబడును.

సివిల్, మెకానికల్, ఎలెక్ట్రికల్, ఆటోమొబైల్, రేడియో, రెఫ్రిజిరేషన్ ఇంజనీరింగ్, ఎలెక్ట్రికల్ సూపర్‌వైజర్, ఎలక్ట్రీషియన్, మోటార్ డ్రైవింగ్, మోటార్ మెకానిక్, టెలివిజన్/ట్రాన్సిస్టర్/రేడియో మెకానిక్ డిప్లొమా/డిగ్రీ కోర్సులకు మరియు అండర్ మెట్రిక్యులేట్లకు అనేక యితర వొకేషనల్ ట్రైనింగ్ కోర్సులకు ప్రవేశము గలదు. బాలికలకు టెలిఫోన్ ఆపరేటర్స్ కోర్సుగలదు. హాస్టల్ వసతులు గలవు. ఉద్యోగులకు సాయంత్రం తరగతులు జరుపబడును. ఉచిత లిటరేచర్ కొరకు వ్రాయండి. లేక రు. 2/- ఎం. ఓ./పోస్టల్ ఆర్డర్ ప్రాస్పెక్టస్ కొరకు పంపండి.

ప్రిన్సిపాల్



ASIA ENGINEERING INSTITUTE,
H. O. Asia House, 21 Daryaganj, Delhi-6.

| Established: | Phone: | Telegraphic Address: |
|---|---|---|
| 1957 | 274563 | ASIATUTE DELHI |

బ్రాంచీలు:

182, మింటు రోడు, మల్లేశ్వరం, బెంగుళూరు-3.
21, ఎస్. ఎస్. పైన్ లేన్, కాలేజివీధి, కలకత్తా-12.
ఢిల్లీ, జలంధర్, లూధియానా.
ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను.

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**డి. దుర్గాప్రసాద్, వల్లపాడు**

సంస్కారానికి నిర్వచనం ఏమిటి?

మన ప్రవర్తనే.

**వై. మాధవి, కడప**

ఈ కాలంలో భార్యలు భర్తలను పేర్లతో పిలుస్తారంటారా?

మీరు వినకుండానే అడుగుతున్నారా యీ ప్రశ్న? అయినా మనలో మనమాట పేరులో ఏముంది?

**ఎన్. నెమరీశ్వరి, పాదిరి**

మీ ప్రశ్నావళిలోకి చేర్చుకుంటారా?

నిరభ్యంతరంగా. రండి—వచ్చి చేరండి.

**పెరుగు శివకోటీశ్వరరావు, ఒంగోలు**

ఎక్కువమంది పెద్దలు తమ అభిప్రాయాలలో విన్నవారిని ఏకీభవించమని ఒత్తిడి చేయుదురేగాని వారి అభిప్రాయములు తెలుసుకొనుటకు ఎందుకు ప్రయత్నించరో అర్థం కావటంలేదు.

ఒక తరానికీ ఇంకొక తరానికీ మధ్య ఎప్పుడూ ఉంటుందీ ఘర్షణ. విరుచుకుపడకుండా అభిప్రాయ ప్రకటన రెండువైపులనుండీ జరిగిన నాడు—ఈ ఘర్షణ కొంత తగ్గే అవకాశం ఉంటుంది.

**రాజా నర్సింగరావు, విశాఖపట్నం**

నిర్ణీత వయస్సు వచ్చినా కూడా ఉద్యోగ ప్రయత్నం చేయక, అన్నల సంపాదనమీద ఆధారపడి, వారి మరుగున అధికారం చెలాయించి ఇంటికోడళ్ళను హీనంగా చూసే వ్యక్తులను ఏమనాలి?

వారి సంగతి వదలండి. ఇలా ఇంటి గుట్టు రచ్చకెక్కించే మిమ్మల్ని ఏమనాలి?

**పి. కోటేశ్వరరావు, గుంటూరు**

మానవునకు దుఃఖం మధ్యలో వస్తోందా? లేక మొదటినుంచీ ఉందా?

మానవుడు ఏడుస్తూ పుడుతున్నాడు. ఏడుస్తూ జీవిస్తున్నాడు. ఏడుస్తూనే చస్తాడు. దుఃఖంలేని దెప్పుడు స్వామీ!

**'గిరిశ్రీ' అనంతపురం**

ఈ కాలంలో 'మెరిట్'కి గల స్థానం?

మెరిట్ స్థానం యీనాడు '0' విలువ. సున్నాకి ఒక పక్క ఏ అంకె చేర్చినా దాని విలువ పెరుగుతుంది. రెండోపక్క ఏ అంకె చేర్చినా ఒకటే. ఆ విలువను ఇనుమడింపచేసే సంఖ్యే 'ఇన్‌ఫ్లుయెన్స్' అనుకోండి!

**సుధశ్రీ సుహాసిని, తాయుడు గూడెం.**

స్త్రీకైనా పురుషునికైనా జీవితంలో పరిపూర్ణత ఎప్పుడు లభిస్తుంది?

సంతృప్తిగా బ్రతకడం నేర్చుకున్నప్పుడు.

**దాట్ల దేవదానరాజు, కోలంక**

నేను ప్రశ్నలు వ్రాద్దామనుకుంటాము గాని భయంవేస్తుంది. ఏం చెయ్యను?

భయపడుతూ ఏ పనీ చేయకూడదు.

**కె. జయకుమారి, నౌపడ**

మీ 'మెరుపుతీగ' ఏమీ బాగాలేదు.

లోకో భిన్న రుచిః అన్నారు కదండీ?

**పి. నిర్మల, కత్తవ్వం**

ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి హృదయపూర్వకంగా అత్యంత గాఢంగా ప్రేమిస్తుంటే అకస్మాత్తుగా ఆ యువకునికి వేరొక యువతితో వివాహము అయితే ఆ ప్రేమమయి హృదయం ఎలా ఉంటుంది?

ఎలావుంటుందేమిటి? బోసుగా ఉంటుందని మీరే చెప్పక చెప్తున్నారు! అంతగా ప్రేమించిన మనిషి ఇంకో స్త్రీని వివాహం చేసుకొన్నప్పుడు ఆమాటకు అర్థం మారిపోలేదా?

**చిర్ల సుబ్బారెడ్డి, జి. మామిడాడ**

స్త్రీలకు మాంగల్యం చూడగానే పెండ్లి అయినదని తెలిసిపోతూంది. మరి పురుషునికి ఏమి చూసి పెండ్లి అయినదని చెప్పగలరండీ?

వారు తూలే దొంగచూపులను పట్టి! బెదురు చూపులను పట్టి.

**సింగము నూకరాజు, అనకాపల్లి**

మానవ జీవితం నీటిబుడగతో సమానం అని తెలిసీ కోర్కెలను చంపుకోలేకపోతున్నాం. ఎందువలన?

మానవులం కనుక!— ఆ క్షణంలోనే మనం బ్రతకడానికి బాటలు వేస్తాం.

**కస్తూరి, రూర్కెలా**

ఎవరికీ తను కలలో తాము చనిపోయినట్లు కల రాదని చనిపోతున్నంతవరకే కల వస్తుందని నా మిత్రురాలు, కాదు తాము చనిపోయినట్లు కల వస్తుందని నేను...

...మీ వాళ్ళు చేరేసరికి, నేను చనిపోయినట్లు నన్ను లేవదీసి కూర్చోపెట్టి 'జవాబురాయి' అన్నట్లు కలవచ్చింది కస్తూరి గారూ. వింతంగా.

**పి. కె. పరమాత్మ, అనకాపల్లి**

ఒక వ్యక్తికి సంసారజీవితం ఇష్టములేక పెళ్లిచేసుకోకుండా ఉంటాడు. కాని తన కష్టసుఖములు చూసేవారు ఉండరేమో అనే భయంపీడిస్తుంది ...ఎలాగ?

ఆ భయమే సాంఘిక జీవనం పెంపొందడానికి తొలిమంచి నాంది అయింది. మీరీకథ వినలేదా? వెనకటికి ఒకసన్యాసి ఉండేవాడుట. రోజూ కట్టుకున్న అంగవస్త్రం ఎలుకలు కొరికి పాడు చేస్తున్నాయని పిల్లిని, పిల్లికి పాలకోసం ఆవును, ఆవుపాడి చూడటం కోసం ఒక ఇల్లాలిని చేరదీశాడుట— సన్యాసికాస్తా సంసారి అయికూర్చున్నాడు!

**పెనుమళ్ళ మురళీధరరావు, ఆమదాలవలస**

ఒక పనికి మానవ ప్రయత్నం ఎంత వరకు ఉండా లంటారు?

తుదదాకాను. కొండశిఖరందాకా బల్లనెత్తిన కొద్ది బండితోసి దేవుడా ఇక నా వీనంతు అని బండివదిలిన అవివేకి కథ తెలియదా మీకు?

**ఎన్.వి.ఎస్.ఎన్. మూర్తి, బరంపురం**

మన హృదయాలలోనే దేవుడున్నాడని చెప్పేవారు కూడా దేవాలయాలకు తరచు వెళుతూ ఉంటారెందుకు?

దేవుడు సర్వాంతర్యామి అంటారే అది అవునో కాదో తేల్చుకోడానికై ఉంటుంది.

**సి. వీరరాఘవులు, కాళహస్తి**

అమృతం తాగిన మృత్యుంజయుడంటారు, గరళమును చవిచూసిన మరణం అంటారు. మరి అమృతమును, గరళమును మిళితముచేసి త్రాగిన ఏమి జరుగుతుందండీ?

బహుశా మృత్యుంజయు గరళుడవుతాడేమో! శాస్త్రకారులను అడిగి చూడాలి!

**శ్రీమతి అల్లంరాజు లక్ష్మి, టిట్లాఘర్**

కళలు ండి వాటిని అభివృద్ధిలోనికి తెచ్చుకోలేనపుడు ఆ వ్యక్తిపడే బాధ ఎవరేనా అర్థం చేసుకుంటారా?

మీ అభిప్రాయం నాకు బోధపడలేదు. కళలంటే ఏమిటి? కొన్ని కొన్ని కళలు నిత్య జీవితపు గాడిలో పడి మీరు కోరినట్లు అభివృద్ధిచెందక పోవచ్చును, ఉదాహరణకి చూడండి, భరతనాట్యప్రవీణ అయిన పిల్లలతల్లి 'అయ్యో నాకళ' అని వాపోయి ప్రయోజనం ఏమిటి? దాని కింకొకరిని వెంటించి సాధించే దేమిటి? అంచేత అభివృద్ధిలోనికి తెచ్చుకోవడం అన్నది వృథే అవుతుంది.







ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యాలంటే ఈ కాలంలో గొప్పయజ్ఞం చేసినంతపని. తగినవరుడ్ని వెదకడంలోనూ, తగినకట్నం యిచ్చి వియ్యంకులను తృప్తిపరచడంలోనూ, పెళ్ళివారికి ఏ స్వల్పమైన అసంతృప్తి కలగకుండా వస్న్లయిలు చెయ్యడంలోనూ కన్యాదాతపడే అవస్థ యింతాలంతాకాదు.

పూర్వం పద్ధతేవేరు.

అసలు సాంప్రదాయికమైన పెళ్ళితంతుకు విరుద్ధంగానే యిప్పటి వివాహాలు జరుగుతున్నాయి.

అప్పుడు వరుడే కన్యను వెతుక్కొని పెండ్లాడేవాడు. కన్యాదాత వరుణ్ణి వెతకడం జరిగేదికాదు. కన్యావరణమే అప్పటిపద్ధతి; వరవరణంకాదు.

ఒకవేళ తగినవరుడు కనబడినా కన్యాదాత కోరి అతనికి తన కన్య నిస్తానని చెప్పకూడదు కూడాను. ఈ సంగతే.

'అయాచితాని దేయాని
సర్వ ద్రవ్యాణి భారత,
అన్నం విద్యా తథా కన్యా
అనర్థిభ్యో న దీయతే.'

అనే శ్లోకం చెప్తూ ఉన్నది.

'అడగకుండా అన్ని వస్తువులనూ దానం చెయ్యవచ్చును. అయితే, అన్నాన్నికాని, విద్యనుకాని, కన్యనుకాని అడక్కుండా మాత్రం యీయకూడదు' అని దీని అభిప్రాయం.

విద్యపూర్తి అయ్యాక బ్రహ్మచారి గృహస్థాశ్రమాన్ని స్వీకరించవలసి ఉన్నది. అతడు తనకు తగిన కన్యను అన్వేషించేడానికి ఇద్దరు బుద్ధిమంతులైన మిత్రుల్ని—ఒక్క అభిప్రాయం కలవారిని కన్యావరణ కోసం పంపాలి.

'సుహృదః సమవేతాన్ మంత్రవతో
వరాన్ ప్రహి
ణుయాత్ —' మదర్థం కన్యాం
వృణీధ్వమ్.'

'నా కోసం కన్యను వెదకి నిర్ణయించండి' అని కోరుతూ ఇద్దరు మిత్రులను, ఆలోచనాపరులను — ఒకరితో ఒకరు ఐకమత్యంగా ఉండేవారిని (వరుడు) పంపవలెను' అని వయి వివాహతంతులోని వాక్యాల అభిప్రాయం.

ఈ పద్ధతిలోనే అప్పటి వివాహాలు జరిగేవి.

పార్వతీదేవి వెనుక జన్మలో శివుని భార్య అయిన సతీదేవియేగాని, వేరొకతె కాదనీ, ఆమెకు పరమేశ్వరుడే తప్ప మరొకరు భర్త కాడనీ నారదమహాముని హిమవంతుడికి చెప్పినా— ఆయన కొంత ఉపేక్షించాడు. పరమేశ్వరుడు కోరకుండా అతనికి తన పుత్రిక నీయగలనని చెప్పడానికి హిమవంతుడు సమ్మతించడంలేదు. దీనికి కారణం అనాదిగా వస్తూన్న మన హైందవ సంప్రదాయమే!

నలమహారాజు చరిత్ర అందరికీ తెలిసే ఉంటుంది. నిషధేశ్వరుడైన నలమహారాజునకూ, విదర్భరాజు పుత్రిక అయిన దమయంతికీ పరస్పరానురాగం కలిగింది. అది హంసరాయబారమూలంగా అభివృద్ధి చెందినది. ఈ సంగతి దమయంతి తండ్రి భీమరాజుకు కూడా తెలుసును. దమయంతిని నలునకేయిచ్చి వివాహం చెయ్యాలనే సంకల్పం అతనికిన్నీ ఉన్నది. అయినా నలమహారాజు అడగకుండా దమయంతిని అతనికిచ్చి వివాహం ఎలా చేస్తాడు?

నలుడుమాత్రం ఎలా యాచిస్తాడు? తాను క్షత్రియుడుగదా!

అందుకోసమే ఆకాలంలో క్షత్రియులకు స్వయంవరం విహితమై ఉండేది. దీనివల్ల ఎవరికీ చిక్కు ఉండేదికాదు.

కన్యాదాత ఎవరునీ ప్రార్థించడు. స్వయంవరానికి మాత్రం ఏర్పాటుచేసి చాటిస్తాడు. ఆ చాటింపునుబట్టి ఆ కన్యను వివాహమాడడానికి అభిలాషవుండే రాజకుమారులు ఆ స్వయంవరానికి హాజరవుతారు.

అయితే — ఇప్పుడు ఆ స్వయంవరాలూ లేవు. కన్యలను వెదకడానికి వరుడు మిత్రులను పంపడమూలేదు.

కన్యలే వరులను వెతుక్కోవలసి స్థితి యేర్పడింది.

అందువల్లనే ఎన్నో సమస్యలు ఏర్పడుతున్నాయి. తీరని చిక్కులు కలుగుతున్నాయి.

పెండ్లిండ్ల మూలంగా చాలా చాలా కుటుంబాలు చితికిపోవలసి వస్తున్నది.

ఇది దేశానికి చాలా అనర్థదాయకం.

ఇలా ఆచారాలు మారిపోడానికి కారణం వరుని పక్షంవారి ధనాశ. అంటే వరశుల్కం! ఇది ఆచారమైపోయింది.

వరశుల్కం న్యాయవిరుద్ధమని శాసనాలు చేయడంవల్ల ఏమీ ప్రయోజనంలేదు.

మనస్సు ఇట్టి ఆచారాలను అరికట్టాలి. శాసనా లెంతమాత్రమూ అరికట్టలేవు.

పి. ఎస్.

# నమ్మకం

కొంతమందికి ఎవరిమీదా నమ్మకం వుండదు. అలాంటికోవలోదే మా వరలక్ష్మి. 'మనొక్కడికీ రావేం! ఎప్పుడూ ఇంట్లో ఎలా తోస్తుందీ!' అంటే, 'గంపెడుసంసారం. అంకంతకొంత వంటమనిషిమీద వదిలి రానా! చేతికందింది ఎత్తుకు పారిపోదా' అంటుంది. వంటమనిషి వాళ్ళింట్లో పదేళ్ళుగా వుంటున్నది. అయినా, ఆవిడంటే నమ్మకంలేదు వరలక్ష్మికి. ఆవిడ వంట చేస్తూన్నంతసేపూ ఆవిడమీద నిఘావేసి వుంచాల్సిందే. ఇంక పనిమనిషి సంగతిలంటే. వాళ్ళిద్దర్నీ కనిపెట్టడంతోనే వరలక్ష్మికి రోజంతా గడిచిపోతుంది.

పనిమనుష్యులనే కాదు. ఇంటిమనుష్యులని కూడా నమ్మలేరు ఇలాంటివాళ్ళు. అందువలన వాళ్ళకి శాంతి వుండదు. ఎదుటివాళ్ళకీ శాంతివుండదు. నిత్యమూ ఎదుటివాళ్ళని శంకిస్తూవుండేవాళ్ళు, తమని తాముకూడా నమ్మలేరు. ఆత్మవిశ్వాసం లేనివాళ్ళకే ఎదుటివాళ్ళమీద విశ్వాసమూ వుండదు. ఈ ప్రపంచంలో అనేక మహ కార్యాలు అచంచలవిశ్వాసం, దృఢనమ్మకం వల్ల జరుగుతున్నాయంటే వరలక్ష్మిలాంటి వాళ్ళకి ఆశ్చర్యంగా వుండొచ్చు. ఇంట్లో ఒక చెంచా కనిపించకపోయినానరే సూటీపోటీగా పనివాళ్ళని నిగ్గదీయడం, అది దొరికినా వాళ్ళకి చెప్పకపోవడం యివి ఆరోగ్యకరమైన పద్ధతులు కావు. పనిమనుష్యులనేది ప్రత్యేకం దొంగతనం చేయడానికి ఉద్దేశ్యింపబడిన జాతికాదనీ, పొట్ట గడవడానికి, మనకి పనిచేసిపెట్టే ఈ మనుష్యులుకూడా మనలాంటివాళ్ళేననీ, వాళ్ళకీ కాస్తో కూస్తో నీతీ, నిజాయితీ వుంటుందనీ, నాగరీకులమైన మనం గ్రహించకపోవడం దారుణం. దొంగతనంచేసే బుద్ధి కొందరిలో వుండడం నిజమే. పనిమనుష్యులే కాదు. గొప్పవాళ్ళలో కొందరికి వుండొచ్చు.

పనిలోచేరిన కొన్నిరోజులకే వాళ్ళ తత్వం మనకి తెలిసిపోతుంది. అటువంటప్పుడు వాళ్ళమీదే అనుమానంపెట్టుకుని ఏ చిన్న వస్తువు కనిపించకపోయినా, వాళ్ళని నిగ్గదీయడం,బెదిరించడం అసహ్యంగావుంటాయి. పనివాళ్ళు మనదగ్గర సంవత్సరాలతరబడి విశ్వాసంగా వుండాలంటే. వాళ్ళమీద మనకి నమ్మకం వుండాలి. మన మంచితనం మీద వాళ్ళకి గౌరవం వుండాలి. కానీ 'అమ్మగారు పట్టి అనుమానంమనిషి' అనే భావం వాళ్ళల్లో నాటుకునే అవకాశం యివ్వకూడదు. పనివాళ్ళసంగతి సరేసరి. ఇంక ఇంట్లోవాళ్ళమీదకూడా నమ్మకం వుండదు చాలామందికి.

మా స్నేహితురాలొకమ్మాయి వుండేది. వాళ్ళాయనకి మంచి ఉద్యోగమే. నెలనెలా జీతం తెచ్చి ఆవిడకే యిచ్చేవాడు. అతను కొంచెం ఎక్కువగా డబ్బు ఖర్చుచేస్తాడని ఆ అమ్మాయికి అనుమానం, అందుకని

## డాక్టర్ కబుర్లు

### స్వీయ పరీక్ష

సంవత్సరానికి కొకసారయినా డాక్టరు దగ్గరికి వెళ్ళటం మంచిది. కాని, వీలయినప్పుడు మీ ఆరోగ్యాన్ని మీరే ఒకసారి ఎందుకు పరీక్షించుకోరాదు?

ఈ కింది ప్రశ్నలకి సమాధానాలు వెదుక్కోవాలి. అనుమానం కలిగితే డాక్టరుని చూడాలి!

1. అంతకిముందు లేని వాపు ఏదయినా శరీరంమీద కనిపిస్తోందా?
2. మాయని పుండు ఏదయినా ఉందా?
3. వంటి మీద పుట్టుకతో ఉన్న మచ్చ పెరుగుతున్నట్టు కనిపించిందా? 
4. కొంచెం ప్రయాసకే ఆయాసం వస్తూ ఉంటుందా?
5. కళ్ళుగాని, చర్మంగాని పచ్చబడి ఛాయ కనిపిస్తూ ఉందా?
6. మలవిసర్జన విషయంలో అలవాట్లు మారుతున్నాయా?
7. ఎక్కడయినా తరచూ నెప్పి వచ్చి పోతూ ఉందా?
8. వంటిమీద పుట్టుమచ్చ రంగు మారే సూచన కనిపించిందా?
9. మడమలు తరచు వాస్తున్నాయా?
10. ఆహారం తగ్గించకపోయినా, బరువు తగ్గటం, ఎక్కటం ఉందా?
11. తరచుమానసిక పరిస్థితి చెడిపోతూ ఉందా? జ్ఞాపకశక్తి క్షీణిస్తూ ఉందా?
12. నడిచేటప్పుడు ఎదురు దెబ్బలు ఎక్కువ తగలటం, అడ్డంగా ఉన్నవాటికి ఢీ కొట్టుకోవటం జరుగుతుందా?



ఈ ప్రశ్నల సమాధానాలు మీ ఆరోగ్యం ఎలా ఉందో సూచిస్తాయి డాక్టరు సలహా తక్షణం తీసుకోవాలి.

హెచ్. ఎల్. హార్సన్‌సన్
(కాపీరయిటు)

అతనికి తెలియకుండా తనపేర బ్యాంక్ ఎకౌంట్ ఓపెన్ చేసుకుని నెలనెలా కొంత డబ్బు దాచడం మొదలుపెట్టింది. ఇంతలో అతని చెల్లెలు పెళ్ళి వచ్చింది. పెళ్ళికి కనీసం వెయ్యిరూపాయలైనా సర్దమని తల్లి తండ్రులు వ్రాశారు. అతనికి ప్రతి సంవత్సరం బోనసు కొంత వస్తుంది. భార్య బ్యాంక్ఎకౌంట్ సంగతి తెలిసి అతను అప్పు యివ్వమని అడిగాడు. ఆవిడ వీల్లేదంది మీరు తిరిగి యిస్తారని నాకేమిటి నమ్మకం అంది. ఫలితంగా అతనికి కోపం రావడం, ఎక్కడో అప్పుతెచ్చి చెల్లిపెళ్ళికి వెళ్ళడం తరువాతనెలనుంచి జీతం తనే జేబులో వేసుకొని ఇంటిఖర్చుకి గీచిగీచి అణాలూ పైసలూ లెక్కపెట్టి యివ్వడం—యివ్వన్నీ సంభవించాయి. అదేమిటని ఆవిడ అడిగితే 'నామీద నీకు నమ్మకం లేనప్పుడు, నీమీద నా కెలా వుంటుంది. నువ్వెంతో నేనంతే కదా!' అన్నాడతను.

ఆవిధంగా భార్యాభర్తలమధ్య కలతలు ప్రారంభమయ్యాయి. జీవితాంతం ఒకే నీడన మెలగవలసిన జీవన భాగస్వాముల మధ్య అప నమ్మకం, అనుమానం తల ఎత్తితే ఎట్టి దుష్ఫలితాలు సంభవిస్తాయో చెప్పక్కర్లేదు. డబ్బువిషయంలో నేకాదు. నమ్మకం అనేది ఇద్దరిమధ్యా అన్నివిషయాల్లోనూ వుండాలి. జీవితం సుఖశాంతులతో నిండి వుండాలంటే, అస్తమానం శంకలతో భయాలతో వేసి పోకూడదు. ఎదుటివాళ్ళని మనం నమ్మితే వాళ్ళు మనను నమ్ముతారు. స్నేహం నిలిచేది నమ్మకంవల్లనేకదా' నిద్ర లేస్తూనే ఎన్నో భయాలతో అనుమానాలతో దినచర్య మొదలు పెడతారు కొంతమంది. పనిమనిషి రావడం అరగంట ఆలస్యమయితే ఆమెకి తను ఎన్ని పాతచీరెలిచ్చింది, ఎన్నిసార్లు పువ్వులు కొనిచ్చింది, సినిమాలకి పంపించింది గుర్తు చేసుకుని ఊరికే మండిపోతూ వుంటారు. చివరికి ఆమెవచ్చి ఏదో కారణం చెప్పి పనిలో జొరబడుతుంది. చెప్పేవన్నీ అబద్ధాలనుకుంటారు కొందరు. నమ్మితే ఇద్దరికీ మంచిదే. స్నేహితురాలు ఎందుకో ఉత్తరం వ్రాయడం ఆలస్యంచేసింది. ఆవిడకి ఈమధ్య గర్వం వచ్చిందనీ, తనని మర్చి పోయిందనీ అనుకుంటూవుంటే అశాంతి. ఏ ఇబ్బందివలన రాయలేదో పాపం, తీరిక వుంటే వ్రాయనిమనిషికాదు. అనుకుంటే మనస్సుకి హాయి. ఈ అనుకోడాలకీ, అనుకోకపోవడానికి మనస్సుకి సుశిక్షణ ఎంతో అవసరం. ప్రతి చిన్నవిషయానికీ అల్పంగా ఆలోచించేకంటే మనస్సుని ఉన్నతమైన ఆలోచనలవైపు మళ్ళించడం మంచిది కదా! నవ్వుతూ, నిదానంగా మాట్లాడుతూ, హుందాగావుండే గృహిణి అంటే అందరికీ గౌరవం వుంటుంది. చిరాకుపడుతూ అనుమానిస్తూ, చిందులు త్రొక్కుతూవుండే గృహిణినిచూస్తే అందరికీ చిరాకుగానే వుంటుంది మరి! ●

**వంటలు :**

## సమోసా

| | | |
|---|---|---|
| మైదాపిండి | ... | 1 కప్పు(నిండా) |
| పప్పు | ... | సగం కప్పుకి కొంచెం తక్కువ |
| వెన్న | ... | 2 చెంచాలు |
| ధనియాలు | ... | 1 చెంచా (పొడి) |
| ఉల్లిపాయ | ... | చిన్నది |
| వెల్లుల్లి | ... | 2 గుత్తులు |
| అల్లం | ... | ఒక అంగుళం |

లవంగం, దాసెన చెక్కపొడి చిటికెడు. జీలకర్ర...సగంచెంచా కారప్పొడి, ఉప్పు.

పిండికి వెన్న కలిపి పాలతో ముద్ద చెయ్యాలి. సన్నగా వత్తి 5 అంగుళాల చదరాలుగా కొయ్యాలి. పప్పుని గిన్నెలోవేసి తరిగిన ఉల్లి, వెల్లుల్లి, అల్లం తక్కిన వాటితో కలిపి చదరాలమీద పెట్టి త్రికోణాలుగా మడవాలి. సెగపేస్తున్న నూనెలో వేయించాలి.

—ఎ. వి. ●

## ఆ ఖా ట ప్ప య్యా



# హెన్రీడేవిడ్ థోరో

"హెన్రీ, నువ్విక్కడున్నావేమిటి?" అని అడిగాడు జైలులో ఉన్న థోరోని చూసి ఊచల ఇవతలనుంచున్న తత్త్వవేత్త రాల్ఫ్ వాల్డో ఎమర్సన్.

'నువ్విక్కడ లేవేమిటి?' అని ఎదురు ప్రశ్న వేశాడు థోరో. ఎమర్సన్ తన స్నేహితుడు జైల్లో ఉన్నాడని విని చూడటానికి వెళ్ళాడు.

ఇద్దరూ జగత్ప్రసిద్ధి పొందిన అమెరికన్ తత్త్వవేత్తలు. థోరో చేసిన చమత్కారంలో ఎంతో గొప్ప సిద్ధాంతం ఇమిడిఉంది. ఆ సిద్ధాంతమే ఒక శతాబ్దం తర్వాత మానవుడి చేతిలో సత్యాగ్రహానికి పెద్ద ధర్మాయుధం అయిపోయింది.

హెన్రీ డేవిడ్ థోరో బానిస పద్ధతి నిర్మూలించాలనేవారిలో ప్రముఖుడు. అమెరికా మెక్సికోమీద యుద్ధం చేసినప్పుడు బానిస పద్ధతి నిర్మూలనోద్యమానికి పెద్ద దెబ్బగా భావించి తన ప్రభుత్వాన్నే నిరసించాడు. నీగ్రోజాతికి జరిగే అన్యాయంపట్ల తను సత్యాగ్రహం చూపాలని నిశ్చయించుకున్నాడు. ఈ యుద్ధంకోసం ప్రజల డబ్బు వినియోగింపటం జరుగుతున్నది కాబట్టి పన్నులు కట్టనన్నాడు. అందుకని అధికారులు అతనిని 1845 లో నిర్బంధించారు. అప్పుడే ఎమర్సన్‌తో ఈ సంభాషణ జరిగింది.

శాంతియుత సహాకార నిరాకరణోద్యమాన్ని ఆధునిక చరిత్రలో ప్రారంభించినది థోరో. తన సిద్ధాంతాలని అతను ఒక పుస్తకరూపంలో కూడా వెలువరించాడు. ఈ పుస్తకానికి మనదేశ చరిత్రలో ఎంతో ప్రముఖ స్థానం ఉంది. దానిని చదివి ఉత్తేజితుడయిన మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీగారు తమ శాంతియుత సహాకార నిరాకరణోద్యమాన్ని మొదలుపెట్టారు. భారతదేశం థోరోకి ఎంతగానో ఋణపడిఉంది.

థోరో మాసచుసెట్స్ రాష్ట్రంలోని కాన్‌కార్డ్ అనే ఊరులో 1817 లో జన్మించాడు. చిన్నప్పుడు తన ఆవుని మేతకని పచ్చిక బయళ్ళలోకి తోలుకుపోతూ ఉండేవాడు. అప్పటినుంచి ప్రకృతి సౌందర్యం అతని మనస్సుని బాగా ఆకట్టుకుంది.

పెద్దవాడయినతర్వాత అతను నిరాడంబర జీవితమే నిజమయిన జీవితం అని రుజువు చెయ్యటానికి కాన్‌కార్డ్ దగ్గరేఉన్న 'వాల్డెన్' కొలనుదగ్గర గుట్టచరియమీద చిన్నపాక వేసుకుని అందులో జీవించటం ప్రారంభించాడు. బీన్స్‌గింజలు, బంగాళాదుంపలు స్వయంగా వేసుకుని వాటిని తిని బతికేవాడు. ప్రకృతి సౌందర్యాన్నిచూసి ఆనందించటమేకాక దీర్ఘంగా ఆలోచించేవాడు. వీలయినంత చదివేవాడు. ఈ దశలో అతనికి వన్యమృగాలతో గాఢస్నేహం ఏర్పడిపోయింది. పక్షులు అతను పిలిస్తే వచ్చేవి, ఉడతలు అతనిని తమతో ఒక జీవిగా స్వీకరించాయి. అటుపోయే బాటసారులు అతనితోబాటు చలిమంట ముందు కూర్చుని అతను చెప్పే కథలు వినేవారు.

'వాల్డెన్' లేక 'అడవుల్లో జీవితం' 1845 లో వెలువడింది. పాశ్చాత్యదేశాలలో దాని ప్రభావం ఇంతా అంతా కాదు. ఇంగ్లాండులో 'రాడికల్' పక్షంవారు దానిని తమ ప్రధాన గ్రంథంగా స్వీకరించారు. ఇది బ్రిటిష్ లేబర్‌పార్టీ స్థాపనానికి దారి చూపింది. థోరో 1862 లో మరణించాడు.

—ఎస్.

## నేననలేదే ?

కునసిమ్మన్నానే కానీ,
మనువాడ మనలేదే ?
మనస్సునందుంచు కొమ్మన్నానే కానీ,
మరచిపొమ్మని ఆజ్ఞాపించలేదే ?
అలిగితినే కానీ
ఆలిని చేసుకొమ్మని కోరలేదే ?
విరబూయమన్నానే కానీ,
విడిపొమ్మని చెప్పలేదే ?
ఎదురు చూస్తుంటానన్నానే కానీ,
ఎవరికి కాకుండా పొమ్మనలేదే ?
కన్నులందు నిలుపుకొనమన్నానే కానీ,
కలియచూడమని చెప్పలేదే ?
మురిపించ వద్దన్నానే కానీ,
ముందర నిలువవద్దనలేదే ?
చేరువకు రావద్దన్నానే కానీ,
చెలియను చూడవద్దనలేదే ?
అన్నానా ? నే నన్నానా ? నేననలేదే ?

యస్. విజయకుమారి

# వారఫలం

**14-7-1967 శుక్రవారం మొదలు**

**20-7-1967 గురువారం వరకు.**

**మేషం:** ఫలితం మాట యెలాగున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు ఏర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. పోటీవారితో మాట పట్టింపులు తగవు. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** మీ ఆత్మ విశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వ్యాపారంలో ప్రయోజనంగల వ్యక్తులను కల్పుకొంటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వృత్తిలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బంది కలిగిస్తుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య:** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగావుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారిలో గౌరవం లభించగలదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో మీరు యింతవరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మకరం:** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగాచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు అనుకూలంగాఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. వారాంతంలో చికాకులు ఏర్పడతాయి. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

**కుంభం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి ఏర్పడుతుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడుతాయి. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. బంధు మిత్రులను కల్పుకొంటారు.

స్త్రీలకు—ఆందోళన కలుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

—మహేష్



# బంగారు చిలక

బి. సీతారామమూర్తి



పూర్వం స్వర్ణపురాన్ని సువర్ణదత్తుడనే రాజు పాలిస్తూ వుండేవాడు. ఒకసారి ఒక మునీశ్వరుడు ఆ నగరానికి వచ్చాడు. అప్పుడు సువర్ణదత్తుడతనికి ప్రేమతో ఆతిథ్యమిచ్చి, ఘనంగా సత్కరించాడు. అందుకా మునీశ్వరుడు చాలా సంతోషించి, ఒక మామిడి మొక్కని రాజుకి బహూకరించాడు. దాన్ని జాగ్రత్తగా పెంచినట్లయితే—రోజుకి మూడేసి బంగారు మామిడిపళ్ళు పలిస్తాయని చెప్పాడు. సువర్ణదత్తుడా మామిడి మొక్కని తన అంతఃపురంలో వున్న ఉద్యానవనంలో పాతించాడు. దానికి ప్రతిరోజూ నీళ్ళుపోసి, కాపాడడానికి ఒక తోటమాలిని నియమించాడు. రాజుకూడా ప్రతిరోజూ స్వయంగా తోటకివెళ్ళి, మామిడి మొక్కని చూసి వస్తూండేవాడు.



ఇలా వుండగా—ఒకరోజు సువర్ణదత్తుడు తోటకి వెళ్ళి చూసేసరికి- చెట్టున మూడు బంగారు మామిడిపళ్ళు కనిపించాయి. అతనికి చెప్పలేనంత ఆనందం కలిగింది. వెంటనే తోటమాలిని పిలిపించి, ఆ చెట్టున వున్న బంగారు మామిడిపళ్ళని ఎవ్వరూ కోసుకొని పోకుండా జాగ్రత్తగా కాపలా కాయమని ఆజ్ఞాపించాడు.

మరునాడు తోటకి వెళ్ళి చూసినప్పుడు రాజుకి మూడు కొత్తపళ్ళు కనిపించాయే కాని పాత మామిడిపళ్ళు మూడున్నూ మాయమయాయి! తన తోటలోవున్న బంగారు మామిడిపళ్ళు ఇలా మాయమయినందుకు రాజుకి చాలాకోపం వచ్చింది. వెంటనే తోటమాలిని పిలిపించాడు. 'రేపటి సాయంత్రంలోగా మామిడిపళ్ళ దొంగని నా యెదుట హాజరుపరచాలి' అని ఆదేశించాడు. తోటచుట్టూ సైనికులని కూడా కాపలా వుంచాడు.

సాయంత్రం వరకూ తోటమాలి స్వయంగావుండి, ఆ పళ్ళని వేయి కళ్ళతో కాపలా కాశాడు. ఎవ్వరూ తోటలోకి రాలేదు. ఎండలో వుండడంవల్ల చాలా అలసిపోయాడు. అందువల్ల తన పెద్ద కొడుకయిన రాముడిని అక్కడ కాపలా వుంచి, తోటమాలి విశ్రాంతి తీసుకోడానికి వెళ్ళిపోయాడు. రాముడు చాలాసేపు మేలుకొనివుండి, కాపలా కాశాడు. కాని, అర్ధరాత్రయేసరికి నిద్ర ముంచుకువచ్చింది. తోటమాలి వచ్చి చూసేసరికి — మూడు పళ్ళకీ రెండే కనిపించాయి! రాముడి అజాగ్రత్తవల్లనే ఒక బంగారు మామిడి పండు మాయమయిందనుకొని, తోటమాలి రాముణ్ని దండించాడు. ఉన్న రెండుపళ్ళనీ ఎవ్వరూ దొంగలించకుండా చూడాలని, తన రెండోకొడుకయిన కృష్ణుణ్ని అక్కడే వుండమని, తోటమాలి దొంగ కనబడతాడేమో చూద్దామని బయటికి వెళ్ళిపోయాడు.

తోటమాలి మళ్ళీ వచ్చి చూసేసరికి — కృష్ణుడు గాఢనిద్రలో వున్నాడు! రెండు మామిడిపళ్ళకీ — ఒక్కటే మిగిలివుంది! కృష్ణుణ్ని బాగా చీవాట్లుపెట్టాడు. తోటలోకి ఎవ్వరూ రాకుండానే చెట్టుమీది పళ్ళు వున్నవివున్నట్లుగానే మాయమవడం తోటమాలికి వింతగా తోచింది. ఎలాగైనా దొంగని పట్టుకతీరాలని నిశ్చయించి, తన ఆఖరి కొడుకయిన వెంకడిని పిలిచాడు. 'రెండు బంగారు మామిడిపళ్ళనీ ఎవరో దొంగిలించుకొని పోయారు. మూడోపండు కోసం మళ్ళీ ఆ దొంగ రావచ్చును. అలా వచ్చినప్పుడు దొంగని పట్టుకోవాలి. జాగ్రత్తగా కాపలాకాయి' అని చెప్పి, తోటమాలి సైనికులని హెచ్చరించడానికి వెళ్ళిపోయాడు.

వెంకడు తెల్లవారుజాము వరకూ మేలుకొనే వున్నాడు. తెలతెలవారుతూండగా—చెట్టుమీది ఆకుల్లోంచి గలగలమని శబ్దం వినిపించింది. తలపైకెత్తి చూశాడు. బంగారు మామిడిపండు దగ్గర ఒక బంగారు చిలక కూర్చొని, ఎండుని తెంపడానికి ప్రయత్నిస్తోంది! వెంటనే వెంకడు విల్లు యెక్కుపెట్టి బాణం వదిలాడు. కాని, ఆ చిలక తప్పించుకొంది. బంగారు ఈకమాత్రం నేలమీద రాలింది. వెంకడు జరిగిన విషయాన్ని తండ్రికి చెప్పి, బంగారు ఈకని ఇచ్చివేశాడు. తోటమాలి ఆ బంగారు ఈకని రాజుగారికి చూపి, జరిగిన సంగతిని విన్నవించాడు.

రాజు 'నాకీ పక్షింపుకో అవసరంలేదు. మూడు బంగారు పళ్ళనీ దొంగిలించిన బంగారు చిలకనే పట్టుకురా' అన్నాడు. తోటమాలి ఈ విషయాన్ని తన ముగ్గురు కొడుకులకీ చెప్పాడు. అందర్లోకీ పెద్దవాడైన రాముడు ముందుకివచ్చి, 'నేను వెళ్ళి బంగారు చిలకని తీసుకొనివచ్చి, రాజుగారికి అప్పగిస్తాను' అని, వెంటనే బయలుదేరాడు.

రాముడు ప్రయాణం సాగిస్తున్నాడు. దార్లో అతనికొక అడవి తగిలింది. అడవిలో కొంతదూరం వెళ్ళాక—అతనికొక జింక కనబడింది. దాన్ని చంపుదామని విల్లు యెక్కుపెడుతూ వుండగా—అది మనుష్య భాషలో ఇలా అంది: 'నన్ను చంపకుండా వదిలివేసినట్లయితే—నీకు బంగారు చిలక వున్నచోటు చెప్తాను.' రాముడు 'సరే' నన్నాడు. అప్పుడాజింక—'అదుగో! అటు చూడు—తూర్పు దిక్కువున్న ఆ గ్రామానికి వెళ్ళేవంతే అక్కడ రెండు ఇళ్ళు కనిపిస్తాయి. వాటిలో ఒకటి అందాల భవనం. ఎంతో విశాలంగా, భోగభాగ్యాలతో నిండి వుంటుంది. అందులోకి వెళ్ళవద్దు.

రెండోది పూరిగుడిసె. అది చాలా చిన్నది. పాడుపడ్డట్టుంది. దానిలోకి ప్రవేశించు. విజయం లభిస్తుంది' అంది.

రాముడు జింక చెప్పినట్లే ఆ గ్రామానికి వెళ్ళాడు. అక్కడొక పెద్దభవనం, ఒక చిన్నగుడిసె కనబడ్డాయి. భవనంలోంచి తియ్యటి సంగీతం, పండుగసంబరం వినిపిస్తోంది. భవనం దగ్గిరికి వెళ్లి చూశాడు. లోపల చాలామంది విందువారగిస్తున్నారు. కొందరు స్త్రీలు నాట్యం చేస్తూవున్నారు. రాముడిని ఆహ్వానించారు కొందరు. అతనికి లోపలికెళ్ళాలనిపించింది. లోపలికి వెళ్ళాడు. వాళ్ళతో కలిసి, హాయిగా కాలం గడపసాగాడు. వచ్చినపనిని పూర్తిగా మరిచిపోయాడు.

బంగారు చిలకని తీసుకొని రావడానికని వెళ్లిన తన అన్నయ్య ఎప్పటికీ తిరిగి రాకపోయేసరికి రెండోవాడయిన కృష్ణుడు తండ్రితో ఇలా అన్నాడు: 'నేనువెళ్లి రాముణ్ణి, బంగారు చిలకనికూడా తీసుకొని వస్తాను.' కృష్ణుడు బయలుదేరాడు. అడవిలో కొంచెందూరం ప్రయాణం చేసేసరికి జింక కనబడింది. రాముడితో చెప్పినట్లే అతనితోకూడా తూర్పుదిక్కున వున్న గ్రామానికి వెళ్తే ఒక పెద్దభవనం ఒక పూరిగుడిసె కనిపిస్తాయనీ, బంగారుచిలక కావాలంటే పూరిగుడిసెలోకి వెళ్ళమని చెప్పింది.

కృష్ణుడుకూడా జింక చెప్పినట్లే ఆ గ్రామానికి వెళ్ళాడు. పూరిగుడిసెలోకి ప్రవేశించాలని అనుకొంటూవుండగా అందాల భవనం వాకిట్లో తన అన్నయ్య కనబడ్డాడు. కృష్ణుణ్ణికూడా అక్కడికిరమ్మని పిలిచాడు. కృష్ణుడు—ఆ భవనంలో విందులూ వినోదాలూ ఖుషీగా సాగుతూవుండడం చూశాడు. ఆ విధమైన ఆనందాన్ని వదులుకోడానికి అతని మనస్సు ఒప్పుకోలేదు. కృష్ణుడు కూడా తన అన్న అడుగుజాడలనే అనుసరించాడు. భవనంలోకి వెళ్ళి, హాయిగా సౌఖ్యాల ననుభవించ సాగాడు. అసలు తను ఎందుకు బయలుదేరాడో ఎప్పుడో మరిచిపోయాడు.

బంగారు చిలకని తీసుకొని వస్తామని వెళ్లిన తన అన్నలిద్దరూ ఎప్పటికీ తిరిగి రానందువల్ల — ఆఖరువాడయిన వెంకడు బంగారు చిలకని ఎలాగయినా తీసుకు రావాలనే దృఢనిశ్చయంతో బయలుదేరాడు. అడవిలో కొంచెందూరం వెళ్ళేసరికి జింక కనిపించింది. 'తూర్పునవున్న గ్రామానికి వెళ్లి, అక్కడున్న పూరిగుడిసెలో ప్రవేశిస్తే బంగారుచిలుక దొరికే అవకాశం వుంటుందని చెప్పింది' రాముడు జింక చెప్పినట్లే ఆ గ్రామానికి వెళ్ళాడు. అందాల భవనం వాకిట్లో తన అన్నలిద్దరూ కనబడ్డారు. తననికూడా లోపలికి రమ్మన్నారు. కాని, వెంకడు తను వచ్చిన కార్యాన్ని సాధించి తీరాలనే పట్టుదలతో పూరిగుడిసెలో ప్రవేశించి, ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు.

మర్నాడు పొద్దున్నే ఆ జింక మళ్లి వచ్చింది. 'ఇంకొంచెందూరం వెళ్ళావంటే ఒకపెద్ద భవనం కనబడుతుంది. అందులోకి వెళ్లి మధ్యనున్నగదిలో రెండు పంజరాలుంటాయి. ఒకటి బంగారంది. రెండోది కర్రది. అక్కడే ఇద్దరు సేవకులు కాపలా వుంటారు. వాళ్ళు ఏమరివున్న సమయం చూసి, కర్ర పంజరాన్ని, అందులోవున్న బంగారు చిలకని తీసుకొని వచ్చెయి. బంగారు పంజరాన్ని మాత్రం ముట్టుకోవద్దు' అని హెచ్చరించి, వెళ్ళిపోయింది.

వెంకడు జింక చెప్పినప్రకారమే భవనంలోకి వెళ్ళాడు. మధ్యగదిలో — పంజరాల దగ్గరున్నభటులు గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. ఇదే తగిన సమయమనుకొని, వెంకడు బంగారు చిలకవున్న కర్రపంజరాన్ని తీసుకొన్నాడు. బయలుదేరబోతూ, 'బంగారు చిలక బంగారు పంజరంలో వుంటేనే బాగుంటుంద'ని, ఆ చిలకని బంగారు పంజరంలో పెట్టబోతూవుండగా — చిలక గట్టిగా అరిచి, నిద్రపోతూవున్న సేవకుల్ని మేల్కొల్పింది. వాళ్ళు వెంకణ్ణి బంధించారు. అతన్ని తీసుకువెళ్ళి తమ రాజు దగ్గర హాజరు పరచారు.

ఆ రాజుగారి బంగారు గుర్రాన్ని ఎవరో ముష్కరులు దొంగిలించారు. దొంగల ఉనికి తెలుసునుగాని వారిని జయించి గుర్రాన్ని తెచ్చుకోవడం ఆయన వశం కాకపోయింది. వెంకడిని చూచి ఆయనకు ధైర్యం వచ్చింది. 'నా స్వర్ణాశ్వాన్ని తీసుకువచ్చి మళ్ళి నాకు అప్పగించావంటే బంగారుచిలకని నీకు ఇస్తాను. లేదా సెరసాల తప్పదు.' అన్నాడు.

వెంకడు బయటికి వచ్చేసరికి జింక కనబడింది అతను జింకకి జరిగిన సంగతి చెప్పి, సహాయంచేయమని కోరాడు. ఆ జింక వెంకడిని ఒక రత్నాలశాల దగ్గరికి తీసు




కొని వెళ్లింది. అనువయిన సమయం చూసి, వెంకడు — రత్నాలని తాకకుండా స్వర్ణాశ్వాన్ని విప్పుకొనివచ్చి, దాని యజమానికి అప్పగించాడు. ఆ రాజు చాలా సంతోషించి, వెంకడికి స్వర్ణాశ్వం, బంగారు చిలకలతోపాటు తన అందాల రాకుమార్తెని కూడా కానుకగా ఇచ్చివేశాడు. కానయితే పెళ్లిచేయలేదు. అతన్ని చేసుకోమన్నాడు. ఇద్దరూ వివాహం చేసుకొని రాగానే తన రాజ్యాన్నికూడా అతనికి ఇచ్చివేస్తానని కూడా మాటిచ్చాడు.

వెంకడు స్వర్ణపురానికి తిరిగి వచ్చాడు. సువర్ణదత్తుడి కొలువుకి వెళ్లి — తనతో కూడా తీసుకొని వచ్చిన బంగారు చిలకనీ, స్వర్ణాశ్వాన్నీ రాజుగారికి కానుకగా యిచ్చాడు. అందుకు రాజు ఇలా అన్నాడు: 'నీ ధైర్య

(64 వ పేజీ చూడండి)



# మట్టిబొమ్మలు



సీరియల్

## తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు వో హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. వెంకట్రామయ్యగారికి జబ్బుచేసి మరణిస్తారు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. తప్పించుకు తిరుగుతుంటాడు ప్రసాద్. తర్వాత అతనంటే ఆమెకు అశాంతి ఎక్కువయింది. స్కూలు హైస్కూలు కావడంతో కామయ్య మాస్టారు పదవీ విరమణ చేయాల్సివచ్చింది. కొత్త హెడ్మాష్టరు ఛార్జి తీసుకుంటూ స్కూలు సొమ్ము రెండువేల రూపాయలు లెక్క తేలనట్టు తెలియపరుస్తాడు.

## 14

శివరామయ్యకోసమై గాలిస్తూన్న ప్రసాద్ చెరువుకట్టవద్ద, పంచాయితీ ఆఫీసులో ఆయన విగ్రహం తరచు కన్పించే పలు కేంద్రాలన్నింటిలోనూ వెతికివెతికి వేసారిపోయ్యాడు. చివరిసారిగా 'మధు' వాళ్ళింటికెళ్ళాడు. ఇంటిముందు వీధిలో పసుపురంగు చిన్నకారు ఒకటి ఆగిఉంది. ఊళ్లో పిల్లలందరూ దానిచుట్టూ గుమికూడారు. డ్రైవరు దాన్ని ముట్టుకోవద్దని పిల్లలను కసురుకొంటూ వహారాకాస్తున్నాడు. తెరచిఉన్నదాని వెనకభాగంలో సూట్‌కేస్—బెడ్ హోల్డాలూ పెట్టిఉన్నాయి.

దానికేసి చూస్తూ ప్రసాద్‌గేటు సమీపించాడు. ఏవేవో పెద్దపెద్ద పుస్తకాలూ రగూ తీసికొని జీతగాడు ఎదురొచ్చాడు.

'ఎవరూ?.....ప్రయాణం'.....ప్రసాద్ అడిగాడు.

'ఇంకెవరు—చిన్నకారులో పొయ్యేది?... బాబుగారు...చదువుకోటానికి పట్నం పోతున్నాడు'...జీతగాడు తానే స్వయంగా కారులో ప్రయాణిస్తూన్నంత సంతోషంగా చెప్పాడు.

ప్రసాద్ త్వరత్వరగా లోనికి నడిచాడు. మేడ ముందుభాగంలో నున్న అరుగుపై శివరామయ్యగారు కాళ్ళుముడుచుకొని కుర్చీలో కూర్చున్నాడు. ఆయన పెదవులమధ్య చుట్ట తగలబడి పోతోంది. గదిలో సామాన్లు సర్దుతూన్న జీతగాళ్ళను పరికిస్తూ సలహాలిస్తున్నాడు. ప్రసాద్ వినయంగా నమస్కారం చెప్పి దిమ్మెకు ఆనుకొని నిలబడ్డాడు—మాట్లాడే అవకాశంకోసం ఎదురుచూస్తూ. ఆయన కుర్చీలోనుండి లేచి నోటినిండా నింపుకొన్న ఉమ్మిని కాండ్రించి ఊసి 'ఏం...ప్రసాదూ?...' అన్నాడు. మళ్ళీ తాపీగా చుట్ట నోట్లో పెట్టుకుంటూ.

'మిమ్మల్ని మాష్టారు రమ్మని కబురు పెట్టారండి'

'రమ్మన్నారూ?...నిన్ను చూడంగనే అనుకొన్నా...వస్తున్నాడులా జంటని ...రా...రా ...కూర్చో' అంటూ స్టూలుకేసి చూపెట్టాడు—ఆయన కుర్చీలో కూర్చుంటూ.

'ఆ...ఎందుకంటా?...నీతో ఏమన్నా చెప్పిపంపాడా?'...పొగ కళ్ళల్లోకి పోయి బొమతలు ఎగరవేసికొని ముక్కు విరుచుకొన్నాడు. ప్రసాద్ సమాధానం చెప్పకముందే మళ్ళీ ప్రశ్నించాడు. 'రమ్మన్నదెవరూ?...కామయ్యగారా?...కొత్త హెడ్మాష్టరా?'...

'ఇద్దరూ?'

'ఆఁ...వస్తున్నానని...ఇదుగో వ్యామేనల్లుడు—వీడు మద్రాసు పోతాలంటే గుంటూరుపోయి చిన్నకారు తీసికొచ్చా...... లేకపోతే నేనేవద్దునటు ... ఆఁ...మీబడి తెరిచేదెప్పుడూ''...అంటూ మెల్లగా మాట్లాడసాగాడు కాళ్ళు ఆరజాపుకొంటూ.

'మేమూ ఎల్లుండి వెళ్లిపోతాం'... శారదనుకూడ ఉద్దేశించి ప్రసాద్ సమాధానం చెప్పాడు. అంతలోనే ఊర్మిళ మంచినీళ్ళ కూజా ఉన్న 'ఫ్రేం' పట్టుకొని బయటికొచ్చింది. ఆమె వెనకాలే 'మధు' బయటికొచ్చాడు నోట్లు లెక్కపెట్టుకొంటూ. చెవులమీదుగా 'మఫ్లర్' చుట్టుకొని పొడుగుచేతుల ఉన్ని స్వెట్టర్ వేసికొన్నాడు. ముఖమంతా అలసటగా ఉంది. నోట్లు లెక్కించుకొని గడపపై కాలుపెట్టి ప్రక్కకు తిరిగి లోనికి చూశాడు చేతిని చూస్తూ—

'తే...తే...వెయ్యి చాలవ్...ఇంకొక అయిదొందలివ్వు' అన్నాడు.

'నీ కెంత డబ్బిస్తే సరిపోతుందో తెలియదురా?'... ప్రేమపూర్వకమైన కోపాన్ని ప్రదర్శిస్తూ అచ్చమ్మగారు ఈవలికొచ్చి ఇంక కొన్ని నోట్లు అతని చేతిలో పెట్టింది. వాటిని పంట్లాంలో కుక్కుకొని తలెత్తి వాకిలివైపు చూశాడు. కళ్ళు ఎర్రగా మండుతున్నాయి చింతనిప్పుల్లా.

ప్రసాద్ రాక అనూహ్యమైనట్లు అతని కళ్ళు ఆశ్చర్యంతో మిలమిలలాడాయి. చేష్టలుడిగి కొద్ది క్షణాలపాటు పల్కరించటమే మరచి పొయ్యాడు.

'హలో ప్రసాద్...వెళ్ళేలోగా నీవు కలుస్తావో లేదో ననుకొన్నా?' అంటూ కరస్పర్శ చేశాడు. ఆ కంఠం పొడిగా ఉంది— ఆప్యాయతా ఆదరణాలేవు. కేవలం లాంఛనప్రాయంగా సభ్యత కొరకే పలికినట్లు పలికాడు. ఆ తరువాత ఏమి మాట్లాడాలో తెలియనట్లు అటూ ఇటూ దిక్కులు చూశాడు.

'మళ్ళీ...ఇక సెలవుల్లోనే కలసికోవటం...ఆ...మాష్టారితో భానూతో చెప్పు... 'టైం' లేక కలిసికోలేక పొయ్యానని...'

కావాలని శారద పేరును ప్రత్యేకంగా విస్మ రింపటం ప్రసాద్ గమనించాడు.

'ఇక వెళ్తావా'...జ్వరంతో బాధపడుతూ నీరసంగా అన్నాడు.

'అంత త్వరగా ఎందుకు వెళ్తున్నావ్?... సంక్రాంతి శెలవులు ఇంకా ఉన్నాయిగా... మీ కాలేజీ ఓపెనింగ్ డే ఎప్పుడూ?'...

ఆ ప్రశ్నతో 'మధు' కొద్దిగా విచలితు డయ్యాడు. రాత్రి సంఘటనను గూర్చి శారద ప్రసాద్‌తో చెప్పిందేమో — అందుకనే ఇలా గుచ్చిగుచ్చి అడుగుతున్నాడని లోలోప కంపించిపొయ్యాడు. ప్రసాద్‌కు కూడ తన పట్ల అసహ్యభావ మేర్పడిందేమోనని అను మానపడసాగాడు ... సమాధానం చెప్పటానికి తటపటాయించాడు.

'మొన్ననే మాది ఓపెనింగ్‌డే ... నిన్న మన స్కూలు భవన ప్రారంభోత్సవమని ఉండిపొయ్యాను... లేకపోతే— ఎప్పుడో వెళ్ళి పొయ్యేవాణ్ణి'...తనవైపు సూటిగా చూడలేక పోవటం — తననుండి ఏదో దాచటానికి ప్రయత్నిస్తున్న బలహీనత ప్రసాద్ గుర్తించాడు.

'ఇంకేమైనా మరచిపొయ్యావురా' అంటూ భానుని వెంటపెట్టుకొని అచ్చమ్మగారు లోనికెళ్ళింది. శివరామయ్యగారు కారుకేసి నడిచాడు.

'రాత్రి స్కూల్లోకూడ ఈ విషయం నాతో చెప్పలేదూ! ఇప్పుడే ఒకగంట క్రితం శారద చెబితే నమ్మలేకపొయ్యాను'... ప్రసాద్ అన్నాడు.

'శారద చెప్పిందా? ... నేవెళ్తున్నట్టు ఉదయం శారదతో చెప్పలేదే,'... మున్నుచుట్టి నట్లు ముతి ముడుచుకొన్నాడు.

'ఉదయం నీవు శారదతో మాట్లా డావా?'

'ఆ...జస్ట్... ఓ పదినిముషాలు — మా మామయ్యగారింటి వద్ద కలిస్తే ... ఎంతో సేపు మాట్లాడలా! ... వెళ్తాం' అంటూ ఏదో తప్పుచేసిన వాడిలా 'ఫీ'లై ప్రసాద్ చేతిని పట్టుకొని ముందుకు కదిలాడు.

'నీవూ...శారదా,— ఓమారు మద్రాసు రండి ప్రసాద్...చూడ్దరుగాని ... మహాబలి పురం శిల్పాలకు కూడ వెళ్దాం'...ప్రేమాభి మానాలు తొణికిసలాడుతున్న కంఠంతో ఆహ్వానించాడు. మృదువుగా చేతిని నొక్కాడు.

ఆ అప్రస్తుత ప్రసంగంలో ఆతని అంతర్యమేమిటో అర్థంకాక ప్రసాద్ తెల్ల ముఖం వేసికొన్నాడు. ప్రేమపూర్వకంగా తన చేతిలో కదులుతున్న మధు చెయ్యి వేడిగా ఉంది.

'ఇంత జ్వరంలో వెళ్ళకపోతే ఏం?'

'వెళ్ళటమే మంచిది...లేకపోతే ఇక్కడ మా అమ్మ కషాయం కాచి తాగమని కూర్చుం టుందోని' పేలవంగా నవ్వి కారులో కూర్చున్నాడు.

డ్రైవరు కారు 'స్టార్ట్' చేశాడు. 'వెళ్ళం గనే ఉత్తరం వెయ్యి. సామాన్లు దించుకొనే ప్పుడు జాగ్రత్త' శివరామయ్యగారు హెచ్చరిం చాడు. ఆ మాటలు లక్ష్యపెట్టక చేతిని బయ టికి చాచి ప్రసాద్‌వద్ద శెలవు తీసికొన్నాడు.



# అందలి సొగసు గలిగించే-పదార్థం జి11 హెక్సాక్లోరోఫిన్ మరియు దాని తాజా సువాసనయేగాకుండా సింథాల్‌కు ఎంతో ప్రత్యేకతను సమకూర్చింది ఏది ?



## తక్కువ ఖర్చు!

సింథాల్ చాలా కాలం నిలవుంటుంది. ఎందుకనగా అది విశిష్టంగా నిర్మించబడింది. అందలి హితమైన తేమ అది నాని కరిగిపోకుండా నిరోధిస్తుంది.




సింథాల్ దుర్గంధ నిరోధకమైన దివ్యమగు సబ్బు. జి-11 (హెక్సాక్లోరోఫిన్) మురికి మరియు చెమట వల్ల ఉద్భవించే క్రిములను నిర్మూలిస్తుంది. శరీర దుర్గంధమును తొలగిస్తుంది.

గెలవండి
రూ. 3,500

సింథాల్ - విజయచిత్ర
పోటీలో పాల్గొనండి

వివరములకు : సింథాల్ డీలర్స్ & డాల్టన్ పబ్లికేషన్స్ కూపనుకు విజయచిత్ర చూడండి.

కాలికి సంబంధించిన మంచీ చెడూ అన్నీ సమస్యలూ తన వ్యక్తిగతమైన జీవిత సమస్యల్లా భావించేవాడు. ఏ మాత్రం లోపం జరిగినా ఎక్కడ ఏ అవకతవకలు జరిగినా ఆయన ప్రాణం విలవిలలాడి పోయ్యేది. తన స్వగృహంలా అహోరాత్రులూ అక్కడే పడి ఉండి స్కూలు బాగోగులను గూర్చి ఏదో ఆలోచిస్తూ వ్రాసికొంటూ కాలం వెళ్లదీసేవాడు. పని తెమలకపోతే భోజనం అక్కడికే తెప్పించుకొనేవాడు.

భానూ ఫ్లాస్కులో కాఫీతెచ్చి 'రండి నాన్నా...ఇక వెళ్దాం...ఆ పని రేపు చూసుకోవచ్చని' గారాబంగా చేతులుపట్టుకొని లాగినా వినిపించుకొనేవాడు కాదు అప్పుడు.

జంగిలి గొడ్లగుంపు ఎదురొచ్చింది—అవి రేపుతూన్న దుమ్ములో కలిసిపోయి వాటి మధ్యగా పోసాగాడు. బర్రె ఒకటి కొమ్ము విసిరింది. దానితో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చి ప్రక్కకు తప్పుకొన్నాడు. ఒక్కక్షణం ఆలోచనతెగి మళ్ళీ అతుక్కుంది.

'ఇప్పుడు—అదే పాఠశాలకు వెళ్లటానికి కాళ్ళు రావటంలేదు. అక్కడ తాను పరాయి వ్యక్తిగా పరిగణించబడుతున్నాడిప్పుడు—తన కు స్వేచ్ఛలేదు — తనసలహా సంప్రదింపులు ఎవరూ అడగటంలేదు. తనకైతాను చొరవ తీసికొని చెప్పినా ఎవరూ పట్టించుకోవటం లేదు. తన ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండ ఎన్నోపనులు జరుగుతున్నాయి. తను సహించి ఊరుకోలేకపోతున్నాడు.

ఆ మూల తిరుగుడులో కొద్దిగా గుంట ప్రదేశం. దీర్ఘంగా ముందుకు చూస్తూ వెళ్తూన్న ఆయనకాలు అదాటున అందులో పడింది. కాలు బెణికింది ... కొద్దిసేపు ఆగి తోముకొన్నాడు. మళ్ళీ పరాగ్గా ఆలోచిస్తూ, కాలు కదిపాడు.

తను పదిపదిహేను సంవత్సరాలుగా కూర్చున్న కుర్చీ కళ్ళలో మెదిలింది. ఇప్పుడు అందులో అతను కూర్చుంటున్నాడు. అది ఆ మూలనుండి ఇటు మారింది. అందులో ఆతనుకూర్చుని గంటకొట్టి తనను పిలిపించుతున్నాడు.

ఆ కుర్చీ ఇప్పుడు తనదికాదు ... ఎంత ప్రయత్నించినా మనసు నిలదొక్కుకోలేక పోతున్నాడు.

(ఇంకా వుంది)

రెండు రత్నాలు
Licenced under M. & T. P. Act — Rule (83)
వీర్యస్తంభనము-Tonic Pills&Oil:
కొబ్బరికి పైకి మర్దనకు (1) కోర్సు 20
ట్యాబ్లెట్లు 2లు - స్పెషల్ రకం రూ. 47
ముందుగా M.O. పంపాలి—వి. పి. లేదు.
డా. రత్నం సన్స్, (Estd 1904)
మలక్ పేట బిల్డింగ్స్, New
ఆజంపూరా మార్కెట్ వద్ద,
హైదరాబాద్ — 36 ఆం. ప్ర.

పండిట్ డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ మదరాసు-17

మీ చర్మ సౌందర్యమునకు...
Nirmala
నిర్మల
ఆయుర్వేదిక్ సోపు వాడండి
Mfrs: NIRMALA CHEMICALS, Cochin-2.
Agents: M/S PRAGATI AGENCIES, VIJAYAWADA-1. (Phone: 5486)

పరిమళ
బ్రాహ్మీ హేర్ ఆయిల్
కున్నితముగా పరిమళం చేయబడిన ఈ ఆయుర్వేద హేర్ ఆయిల్ మెదడునకు చల్లదనాన్ని, ఉపశమన కలిగించును. క్రమముగ
బ్రాహ్మీ హేర్ ఆయిల్ వాడకం మెదడుకు కలుగు అలసటను తొలగించి, హాయిగా నిద్రపట్టించును, ఆరోగ్యమైన కురులు పెరుగుటకు తోడ్పడును.
బెంగాల్ కెమికల్
కలకత్తా బొంబాయి కాన్పూరు




# మల్లన్న మంత్రి

కౌటిల్య

మంత్రిగా మల్లన్న తన విధులను సక్రమంగా నిర్వహిస్తూ, రాజు అభిమానంతోపాటు, ప్రజల గౌరవాన్ని కూడా చూరగొన్నాడు. మల్లన్న మంత్రి తెలివితేటలను గురించిన కథలు దేశమంతటా వ్యాపించేయి.

క్రమంగా ఆ కథలు చక్రవర్తి చెవిని కూడా పడ్డాయి. మల్లన్నమంత్రి తెలివితేటలను పరీక్షించాలని చక్రవర్తికి కుతూహలం కలిగింది. కొద్ది కాలంలోనే అటువంటి అవకాశం కూడా లభించింది.

రాజు యెప్పుడూ ఒక రత్నహారాన్ని ధరిస్తుండేవాడు. అందులోని రత్నాలు చాలా విలువైనవే కాకుండా ఆ రత్నహారం వంశ పరంపరగా రావడం వలన రాజుకు దాని మీద ప్రత్యేకమైన శ్రద్ధ ఉండేది. ఒకనాడు హఠాత్తుగా ఆ రత్నహారం ముక్కలు ముక్కలుగా విరిగిపోయింది.

ఆ రత్నాలతో తిరిగి అటువంటి హారాన్నే చేయిద్దామని రాజు అనుకొన్నాడు కాని తగిన పనివాడు ఆ రాజ్యంలో యెక్కడా దొరకలేదు. అటువంటి హారాన్ని చేయగల పనివాడు చక్రవర్తి కొలువులో ఉన్నాడని రాజుకు తెలిసింది. ఆ పనివాణ్ణి పంపవలసినదిగా కోరుతూ రాజు చక్రవర్తికి ఉత్తరం వ్రాశేడు.

ఇదే తగిన సమయమని చక్రవర్తి అనుకొని, శరభయ్య అనే పనివాణ్ణి, ఒక ఉత్తరం యిచ్చి రాజు వద్దకు పంపించేడు. "శరభయ్య మంచి పనివాడే కాకుండా మోసగాడు కూడా. అయినప్పటికీ మల్లన్న వంటి మంత్రి మీ దగ్గర ఉండగా శరభయ్య యేమి చెయ్యగలడు?" అని ఆ ఉత్తరంలో ఉంది.

మల్లన్న మంత్రి ఆ ఉత్తరం చూడగానే తన తెలివిని పరీక్షించడానికే చక్రవర్తి శరభయ్యను పంపేడని ఊహించి అతనికి తగిన కాపలాను యేర్పాటు చేయించేడు.

శరభయ్య దూరంగా ఒకపల్లెలో మకాం యేర్పాటు చేసికొని, రోజూ కోటకు వచ్చి అక్కడే రత్నహారాన్ని తయారు చేసేవాడు. వచ్చేటప్పుడు వెళ్ళేటప్పుడు కూడా శరభయ్యను రాజభటులు సోదా చేసేవారు కాని యెప్పుడూ యేమీ దొరకలేదు.

రత్నహారం తయారైన తరువాత రాజు, మంత్రి మొదలైనవారు, దానిని చూసి చాలా మెచ్చుకొన్నారు. శరభయ్య రాజుతో అప్పుడు యిలాగ అన్నాడు: ప్రభూ! ఒక్కొక్కప్పుడు నేను స్నానం చేయకుండానే యీ రత్నహారపు పని చేసేను. అందుచేత మీరు దీనిని ధరించే ముందు ఒకసారి నేను స్వామివారి పుష్కరిణికి ఊరేగింపుతో తీసికొని వెళ్ళి అక్కడ దీనికి అభిషేకం చేసి తీసికొని వస్తాను.

రాజు దానికి అంగీకరించేడు. చెప్పిన ప్రకారం శరభయ్య రత్నహారానికి స్వామివారి కోనేరులో అభిషేకం చేసి రాజుకు తిరిగి రత్నహారాన్ని అప్పగించేడు. తరువాత రాజు యిచ్చిన బహుమానాన్ని పుచ్చుకొని శరభయ్య చక్రవర్తి వద్దకు వెళ్ళిపోయేడు. శరభయ్య వెళ్ళిపోయిన తరువాత కొద్దిరోజులకే రత్న పరీక్ష చేసే నిమిత్తం మల్లన్న మంత్రిని పంపవలసినదిగా చక్రవర్తి రాజుకు కబురు పంపించేడు.

మల్లన్నమంత్రి చక్రవర్తి వద్దకు వెళ్ళేసరికి శరభయ్య కూడా అక్కడ ఉన్నాడు. చక్రవర్తీ, శరభయ్యా కూడా మల్లన్నమంత్రిని చూసి తమలో తాము నవ్వుకొన్నారు. ఆ నవ్వుకు అర్థమేమిటో, మల్లన్న మంత్రి తెలుసుకొన్నాడు.

అచ్చంగా శరభయ్య రాజుకు తయారు చేసిన రత్నహారం వంటి హారాన్నే చక్రవర్తి మల్లన్నకు చూపించి దాని విలువను నిర్ణయించ వలసినదిగా కోరేడు. మల్లన్నమంత్రి ఆ హారాన్ని దూరంనుంచి చూసే యిలాగ అన్నాడు.

ప్రభూ! అవి నిజమైన రత్నాలు కావు. ఆ హారాన్ని వెండితో తయారు చేసి దానిమీద బంగారపు పూత పూసేరు. అందుచేత దాని విలువ పది వరహాలు మాత్రం ఉంటుంది. హారం మధ్యనున్న పెద్దరత్నం వెనుక దాని విలువ యిదివరకే వేసి ఉంచేను. మీరే దానిని చూడవచ్చును.

ఈ మాటలు వినగానే చక్రవర్తి, శరభయ్యా, మిగిలిన సభవారూ కూడా నిర్ఘాంతపోయేరు. హారాన్ని పరీక్షించగా మల్లన్న చెప్పిన చోట పదివరహాలు అని ఉంది. జరిగిన దేమిటో పూర్తిగా చెప్పవలసినదిగా చక్రవర్తి అప్పుడు మల్లన్నమంత్రిని కోరగా మల్లన్నమంత్రి యీ విధంగా తెలియచేసేడు.

శరభయ్య పగలు కోటలో అసలు రత్నహారాన్ని తయారు చేస్తూ రాత్రి పూట తన మకాంలో యీ నకలు హారాన్ని చేస్తుండేవాడు. ఈ సంగతి నాకు భటుల ద్వారా తెలిసింది. పూర్తిగా తయారైన తరువాత ఆ నకలు హారాన్ని కోనేరులో గుర్తుగా దాచేడు. అసలు రత్నహారాన్ని అభిషేకానికి తీసికొని వెళ్ళినప్పుడు శరభయ్య అసలు రత్నహారంతో కోనేరులో మునిగి, నకలు రత్నహారంతో బయటకు వచ్చేడు. శరభయ్య రాజుకు నకలు హారాన్నే యిచ్చేడు.

రాజు శరభయ్యకు బహుమానం యిస్తున్నప్పుడు, ఆ నకలు హారం మీద గుర్తు నిమిత్తం దాని విలువ వేసి, కోనేరుకు పంపి దానిని అక్కడ ఉంచి అసలు హారాన్ని తిరిగి తెప్పించేను. అందుచేత శరభయ్య మీకు యిచ్చినది నకలుహారమే.

ఈ సమాధానం వినగానే చక్రవర్తి మల్లన్న మంత్రి తెలివికి సంతోషించి తగిన బహుమానాన్ని యిచ్చి పంపించేడు. ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1967 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరంకూడా "ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి కథలపోటీ" నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము. రచయితలందరూ ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 1600**

**రెండవ బహుమతి రు. 900**

**మూడవ బహుమతి రు. 500**

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంతరచనేననీ దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదనీ హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితం మీద కాక కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజికి రెండు రెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరు మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు—1' కి పంపాలి.

5. పోటీకి గడువు తేది 31—8—67. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 3—11—1967 తేదీకల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుదినిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.




క్లాసు మొదలవడానికి యింకా పది నిమిషాలుందనగా, విద్యార్థినులు ఒక్కొక్కరూ క్లాస్‌రూమ్‌కి రావడం మొదలుపెట్టారు. ఇంకా లెక్చరరు రానందున అబ్బాయిలందరూ బయట వరండాలోనే మకాం వేశారు, అమ్మాయిలమీద కామెంట్లు విసురుతూ. మరి కొంతమంది ద్వారపాలకులిలా గుమ్మానికి అటూయిటూ నిలబడి, 'వన్: టూ త్రీ' అంటూ అమ్మాయిలను లోపలకు సాగనంపుతున్నారు. ఉన్నట్టుండి ఒకసారిగా కోలాహలం ఎక్కువైపోయింది. 'డీలక్స్ ఎక్స్‌ప్రెస్ రోంయ్! త్వరగా తప్పుకోండి' అంటూ దారిచ్చారు తలుపుదగ్గర నిలబడున్న అబ్బాయిలు.

'అబ్బ ఎంతహంకారంరా!'

'అందగత్తెనని కాబోలు!'

'కాదురా: క్లాసుకు ఫస్టునని.'

'ఎంత ఫస్టొచ్చి మాత్రమేమి ప్రయోజనమురా. శిష్యా,

చివరకి వనితకు వంటిల్లు తప్పదని మరువకురా, శిష్యా!' అంటూ అందులో ఒకబ్బాయి రాగం తీసేసరికి, ఒక్కసారిగా అందరూ ఘొల్లుమంటూ నవ్వేశారు. దానికి లయగా చప్పట్లు, బూటుకాళ్ళ మద్దెలలు చెవులు గింగుర్లెత్తించసాగాయి.

వీటన్నిటికీ బాధ్యురాలయిన లావణ్య మాత్రం, నిశ్శబ్దంగా, తలొంచుకుని, లోపలికొచ్చి తనసీట్లో కూర్చుండిపోయింది. వాళ్ల కామెంట్లుతో అందమైన ఆమె ముఖం మరికొంచెం ఎర్రబడింది. కర్చీఫ్‌తో నుదుటిమీద చిరుచెమట అద్దుకుంటూ పుస్తకం తెరిచింది.

'అబ్బబ్బ పట్టిపుస్తకాల పురుగురా బాబు'

'ఇరవైనాలుగ్గంటలలా చదువుతుంటే తలనొప్పయినా రాదో ఏమో?'— వెనకాల చేరిన బృందం మళ్లీ అల్లరిచేయడం మొదలుపెట్టారు.

'నాకూ పుస్తకాలకూ అమడ దూరమనుకో భాయ్!' అని ఒకబ్బాయంటే—

'వాటిని చూస్తేనే నీకు ఎలర్జీ వస్తుందిరా' అని తిడతారురా మా ఫాదర్' అన్నాడు మరో అబ్బాయి.

'మై గాడ్!' అనుకుంది లావణ్య రెండు చేతులతో తలపట్టుకుని, 'ఎలా అయినా లావణ్యకు మరీ గొప్పలెక్కువ!'' వెనక బెంచీలలోని అమ్మాయిల గుసగుసల తాలూకు మాటలు చెవిని దూసుకు వచ్చాయి. విస్తుపోయిందా అమ్మాయి. 'అబ్బాయిలంతా చూస్తున్నారని మరికొంచెం వేషాలేస్తుందిలే. తనే మహాగొప్ప చదివేసేదానిలా'. ఇంకా మాటలు వినలేక బాధతో ఆమె హృదయం గిలగిల లాడింది. తోటి సహాధ్యాయినులు కూడ ఎంతనభ్యంగా ప్రవర్తిస్తున్నారు. ఛీ ఛీ' అనుకుంది చిరాకుగా.

మంచి మార్కులొస్తే చూడలేరు. మంచిబట్టలేస్తే చూడలేరు. అందంగా ఉంటే చూడలేరు. వాళ్లా మనుష్యులంటేను. తనంటే ఎందుకో అందరకూ ఈర్ష్య! మనసిచ్చి ఒకరూ మాట్లాడరు. ఛీ, ఎందుకొచ్చిన చదువు! అమ్మమ్మ చెప్పినట్టూను, ఆ అబ్బాయి ఎవరో అన్నట్టు ఆడపుట్టుక పుట్టాక వంటిల్లు ఎప్పటికైనా తప్పదుగా' అనుకునేసరికి క్రిందటి రోజు తతంగం కంటిముందు మెదిలింది.

తను బ్రతికుండగానే, మనవరాలి మెడలో మూడుముళ్లూ, రాబోయే ఎండల్లో వేయించేయాలని ముసలావిడ ఓ తొందర పడిపోతోంది మధ్య. పెళ్లిచూపులకని ఎవరో క్రితంరోజు రావడంతో ఆవేళకి కాలేజీ కూడ మానేయాల్సివచ్చింది. ఆ పెళ్లి కొడుకుని చూశాక పెళ్లంటేనే విరక్తి కల్గింది. అతనితో పెళ్లిజరిగితే, యింక నలుగురితో తలెత్తుకు తిరగక్కర్లేదు: అనాకారి మొగుడొచ్చినందుకు తోటి వాళ్లందరి కళ్లూ చల్లగా ఉంటాయి' అనుకుంది అతన్ని చూడగానే.

అదేం ప్రారబ్ధమో? తనుచూసి, మూర్ఛపోయిన ఆ పెళ్లికొడుకు కొంచెమూ, పెద్దవాళ్లకు లక్షణమైన కుర్రాడిలానే కనిపిస్తున్నాడు.

క్లాసంతా గొల్లున నవ్వుతగాంటే ఉలిక్కిపడి చూసింది లావణ్య. ఎదురుగా లెక్చరర్!—ఎప్పుడొచ్చారో?—అప్పుడే అటెండన్సు రిజిస్టరుతీసి నెంబర్లు పలుకుతున్నారు.

ఛీ, లేచినవేళ మంచిదికాదు. ప్రొద్దుటే లేచి ఎవరిముఖం చూశానో అనుకుంది. ఇంచుమించు ఆ రోజంతా అలాగే నిర్లిప్తతగా గడిచిపోయింది. ఆఖరికి ఏ ఒక్క క్లాసులో కూడ, ఒక్కసారమైనా బుర్ర కెక్కకుండా మొరాయించాయి.

కాలేజీ అయిపోయింది. ఇంటికెళ్లి పోదామని మెట్లుదిగుతోంది. మలుపు తిరిగే సమయంలో ఊహించని సంఘటన ఒకటి జరిగింది. తలవంచుకు పరధ్యాన్నంగా దిగుతోన్న ఆ అమ్మాయి, ఎదరనుంచి వస్తోన్న ఆ అబ్బాయిని గమనించలేదు.

అతనుకూడ ఎందుకో హడావుడిగా అడుక్కోలేందేసి మెట్లు దొప్పున దిగాకుతూ, ఇంచు మించు పరుగెడుతోన్నట్టుగానే వస్తూ ఆ అమ్మాయిని ఢీ కొట్టాడు. ఆ ఢీకొట్టడంలోనూ అతనితల సూటిగా వచ్చి, ఆమె హృదయానికి తగిలింది.

అనుకోని సంఘటనకు యిద్దరూ స్తంభించిపోయారు, నోటమాటరాక. ఆ యిద్దరి హృదయాలూ ఒక్కసారిగా స్పందించి, సన్నగా కంపించసాగాయి. చెదరిన గుండెలను కూడదీసుకుని, జరిగినది అర్థం చేసుకునేసరికి అప్పుడే, విద్యార్థులు చుట్టు ముట్టేసి తలోమాటా విసిరేస్తున్నారు.

'వండర్ ఫుల్ ఛాన్స్!.

'కంగ్రాట్యులేషన్స్ బ్రదర్!'

'అదృష్టవంతుడివోయ్!'

'ఈ రోజుని సువర్ణాక్షరాలతో డైరీలో లిఖించుకోవచ్చు భాయీ!'

అవమానంతో కృంగిపోతోన్న లావణ్య ఈ మాటలు భరించలేక పోయింది. తల గిర్రున తిరుగుతూంటే, ఉద్రేకంతో చెయ్యెత్తింది. మరుక్షణంలోనే అవతల అబ్బాయిచెంప ఛెళ్ళుమంది. 'సారీ' అన్న అతని కంఠస్వరం పెదాలుదాటి యింకా బయటకు రాకుండానే ఆగిపోయింది అంత వరకూ పశ్చాత్తాపంతో నోటమాట రాక నిలబడి పోయున్న ఆ అబ్బాయి, మరుక్షణమున్న చెంపను చేత్తో రాసుకుంటూ, ఒకేఒక్కసారి ఆమెకళ్ళలోకి కోతుగాచూసి గిరుక్కున వెనక్కుతిరిగాడు. తోటి విద్యార్థిలోకం ముందు తనకు జరిగిన అవమానానికి తలెత్తుకోలేక, ఎర్రబడ్డ ముఖంతో వడివడిగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు.

ఆ అబ్బాయి చూసినచూపులు మరుక్షణ గుచ్చుకున్నట్టయి, గుండెలు ఝల్లుమన్నాయామెకు.

ఆ సంఘటన అంతటితో ఆగిపోలేదు. ఆమె జీవితాన్నే మరోమలుపుతిప్పి ఊపిఊపి మరీ వదిలింది.

అనాలోచితంగా ఏదో తెలీని ఉద్రేకం ఆ అబ్బాయి చెంప ఛెళ్ళుమనిపించేలా చేసినా అతర్వాత ఆ అబ్బాయి చూసిన చూపులుమాత్రం ఆమెహృదయంలో హత్తుకుపోయి, విడువకుండా వెన్నంటసాగాయి.



ఆ అబ్బాయి కావాలని చేయలేదేమో? పొరపాటు జరిగి ఉండొచ్చు. అంత మాత్రానికే తను తొందరపడింది. చుట్టుప్రక్కల యువకుల పరిహాసాలు, వ్యంగ్యోక్తులు, వెనుకనుంచి వస్తున్న అమ్మాయిల గుసగుసలు తనను కొత్తగొట్టి ముక్కలు చేసి వదిలాయి. హఠాత్తుగా జరిగిపోయిన ఆ సంఘటను అర్థంచేసుకో దానికి సావకాశం కూడ లేకపోయింది. తన నేడిపించడానికే, అబ్బాయిలంతా కలిసి పన్నిన నాటకమేమో యిది అనే ఊహించింది. అందుకే మరో ఆలోచన లేకుండా చెయ్యి చేసుకుంది.

కాని...అతను తలెత్తి సూటిగా తన కళ్లల్లోకి చూసిన చూపులుమాత్రం ఆమెలో ఒక్కక్షణం కలవరపాటు కల్గించాయి.—సందేహంలేదు. అతను అల్లరి చిల్లరివాడుకాదు. ఫైనలియర్ స్టూడెంటు. బాగా చదువుతాడని, చాలా మంచివాడని, అమ్మాయిల జోలికి రాడని, తోటి మిత్రులద్వారా అనేకసార్లు వింది—అతని గురించి.

అయిపోయిన దానిగురించి యిప్పుడు విన్నుకుని ఏమి ప్రయోజనం? తన తొందరపాటుకు పరిణామం ఎలా జరుగనుందో? ఈ గొడవలు ఎంత దూరం వరకూ వెళ్తాయో? ఇలా ఆలోచనలు పెరుగుతుంటే చివరికి ఆ అమ్మాయిని ఎక్కడలేనిభయం ఆవహించింది.

ఆ మర్నాడు బెదురుతూనే కాలేజీలో అడుగు పెట్టింది.

## సంపఘ్లేషమంది

వెయిటింగ్‌రూంలో కూర్చున్న లావణ్యతో, 'నీకోసం ఎవరో వచ్చారు' అని చెప్పారెవరో.

ఎప్పుడూలేనిది, ఎవరొచ్చి ఉంటారా అని ఆందోళనగా వచ్చిన లావణ్యకు, పదిమంది అబ్బాయిలు కిలకిల్లాడుతూ కనిపించారు గుమ్మందగ్గర. అడుగు ముందుకుపడలేదు. దడదడలాడుతోన్న గుండెలను గుప్పెట్లో పెట్టుకుని. తడబడుతూ మరో నాలుగడుగులు ముందుకు వేసింది.

'గుడ్‌మార్నింగ్ లావణ్యగారూ! గుడ్ మార్నింగ్' అంటూ ఏకకంఠంతో పలికిన అబ్బాయిలకు సమాధానంగా విగ్రహ ప్రతిమలా నిలబడి పోయింది.

'నిన్న జరిగిన సంఘటనకు అందరం ఎంతో విచారిస్తున్నాం' అన్నాడు ఒకబ్బాయి కొంచెం ముందుకువచ్చి.

'కాని మీరుమాత్రం చాలా దురుసుగా ప్రవర్తించారు. అది మాత్రం సహించ రానిది'— ఆ వెనువెంటనే విసురుగా వచ్చి తగిలింది మరోబాణం.

'మా మిత్రుడి తరఫున మిమ్మల్ని ఎపాలజీ అడగడానికి వచ్చాం.'

'మీరు ఎపాలజీచెప్తే వదిలిపెట్టేస్తాం.'

'లేకపోతే యీ గొడవ యింతటితో ఆగదని...'

'...చాలాదూరం వెళ్తుందనీ, చెప్తున్నాం' అంటూ ముగించారందరూ.

'నిజా మేలుకోలే మరోసారి అడుగుతున్నాం. ఏమంటారు ? ? ?'—అంటూ చూశారు ఆఖరికి.

విలవిల ప్రశ్నలవర్షం కురిపిస్తున్న అంతమంది యువకులముందు, అడవిలో, పులిముందు మేకపిల్లలా గజగజలాడుతూ నిలబడిపోయింది లావణ్య. నోరు ఎండిపోయినట్లయి ఎంత ప్రయత్నించినా ఒకమాటా వెలుపలికి రాలేదు. బలవంతాన నోరు పెగల్చుకుని, పెదాలు నాలికతో తడుపుకుంటూ, 'ఆలోచిస్తాను' అంటూ గిరుక్కున వెనక్కుతిరిగి వచ్చేసింది.

ఆ సంఘటన గురించి కాలేజీఅంతా గొడవ గొడవగా తయారయింది. ఎక్కడచూసినా ఎవరినోట విన్నా, యిదేకబుర్లు, యిదే గొడవ. చూస్తున్నకొద్దీ, వింటున్నకొద్దీ లావణ్యకు గాభరా ఎక్కువైపోతోంది. కాలూ చెయ్యీ ఆడడంలేదు. తనుచేసిన పని న్యాయమే నంటూ తనను సమర్థించేవాళ్లు ఒక్కరూ కనిపించడంలేదు. ఎక్కడో ఒకరిద్దరమ్మాయిలువచ్చి, 'మంచిపనిచేశావు లావణ్యా! కుక్కకాటుకు చెప్పుదెబ్బలా, అబ్బాయిలకు బుద్ధొచ్చేలా మహా బాగా చేశావు. ఇక్కడితో యింక ఆడపిల్లల జోలికిరారు' అంటూ వచ్చి అభినందించారుగాని, మిగతా అమ్మాయిలందరూమాత్రం లావణ్యేముందు తొందర పడిందని ఏకగ్రీవంగా తీర్మానించేశారు!

క్లాసు కొచ్చేసరికి బోర్డుమీద పెద్ద పెద్దక్షరాలతో వ్రాసుంది—'జరిగిన దానికి పశ్చాత్తాపపడు. లేదా పశ్చాత్తాపం పడేలా చేయించగలం.' భయంతో ఆమె శరీరం నిలువెల్లా కంపించింది.

క్లాసులో కూర్చునుండగా కాగితంబాణం ఒకటి ఎగిరొచ్చి ఒళ్లో పడింది. ప్రక్కమ్మాయి నెమ్మదిగా విప్పి చదివింది. 'త్వరలో ఎపాలజీ యివ్వకపోతే, మా మిత్రుడికి జరిగిన సత్కారం మీకూ జరుగుతుంది జాగ్రత్త' చదివి లావణ్యకళ్లలోకి విజయగర్వంగా చూసిందా అమ్మాయి. 'చేసిన దానికి ఫలితం ఎంత త్వరగా కనిపించిందో చూశావా?' అన్నట్టున్న ఆ చూపులు ఎదుర్కోలేక తలవాల్చుకుని దిగులుగా ఉండిపోయింది.

క్లాసయిపోయాక వరండాలో నడుస్తోన్నప్పుడు, అబ్బాయిలందరూ మీద మీదకొచ్చి 'జరిగిన పొరపాటుకు చింతిస్తున్నావా? లేదా? సుందరి!' అంటోన్న



"ఫలితం విషయంలో అన్ని తలనొప్పి బిళ్లలూ ఒకటే"
అని విచారనుకొంటుంటే



వాడి చూడండి!




స్క్విబ్ తయారీ

# అవెదన్®

అద్భుతమగు 'ఏపెప్'తో కూడిన బిళ్లలు! శీఘ్రమైన, నిరపాయమైన, నిశ్చయమైన బాధ నివారణకు!




'ఏపెప్'తో కూడిన అవెదన్ నిమిషాలలో పనిచేయును.... విశ్రాంతి గంటలకొలది వుంచును!

తల నొప్పి, పంటి పోటు, ఒళ్లు నొప్పులు, కండరముల నొప్పి, రొంప, ఫ్లూ, స్త్రీలకు సాధారణముగా నెలసరి రోజులలో వచ్చు బాధలు మరియు ఇతర కొన్ని అస్వస్థతలకు—అవెదన్

SQUIBB® సారాభాయ్ కెమికల్స్

® ఇ. ఆర్. స్క్విబ్ అండ్ సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు. దీని లైసెన్సు ఉపయోగించుటకు అధికారమిచ్చినవారు సారాభాయ్ కెమికల్స్.

వ్వుడు తరిగిపోతున్న దుఃఖాన్ని అపుకుని తెలియటంగురూము కొన్ని ఏడుస్తూండి పోయింది: చాలాసేపు.

'లాభంలేదు. వాళ్ళతో ఎందుకొచ్చిన గొడవ. పరీక్షలు మూస్తే దగ్గరకొస్తాయి. వాళ్ళు చూస్తే ఈ విషయంలో మహా పట్టుగా ఉన్నారు. తప్పు ఒప్పేసుకో' అన్నారు మిత్రురాండ్రు ఓదార్చుతూ.

ఇలాంటివే తరపరంపరగా వస్తోన్న ఒత్తిడికి, మొదట ఆమె కంగారుపడి క్రుంగిపోయినా, రాను రాను ఆమె సున్నిత హృదయం బండబారిపోయింది.

'ఏమిటీ అర్థంలేని బెదిరింపులు!' అనుకుంది చిరాకుగా.

'తొందరపడడం తనది తప్పే అని ఒప్పుకోవాలనుకున్న ఆమె,— నిజానికి ఆలోచించి చూస్తే నా తప్పేముంది? దిగివస్తోన్న తనను చూడకపోవడం అతని తప్పు. పైగా క్షమించమనైనా అడగలేదు. పెత్తగదా. ఎదురు తననే బెదిరిస్తున్నారు. చూస్తా. ఎంతవరకూ వెళ్తుందో వెళ్ళనీ' అనుకుంది మొండిగా.

'నేను ఏమాటా ఇవ్వనుగాక ఇవ్వను. ఇవ్వాల్సిన అవసరం నాకేమీలేదు' అంది విద్యార్థినుల మధ్య ధీమాగా

పట్టుదలతో పగబట్టిన విద్యార్థుల బెదిరింపులకు ఫలితం త్వరలోనే కనిపించింది. మానవత్వం కోల్పోయి మరీ అన్యాయంగా నిర్బంధించారు. విద్యార్థులు. ఆవేళ ప్రాక్టికల్సు అందరికంటే

## పంపళ్ళెకసంది

కొంచెం ముందుగా అయిపోవడంతో, యింటికి వెళ్ళడానికి యివతల కొచ్చింది లావణ్య. ఇంకా టైము అవకపోవడంవల్ల, రిక్షావాళ్ళెవరూ రాలేదు. అడ్డదారిని వెళ్తే గోడ్డును త్వరగా చేరుకోవచ్చన్న ఉద్దేశ్యంతో, ఒంటరిగానే బయలుదేరి, చెట్లు పుట్టలకు అడ్డంపడి నడవసాగింది.

సరిగ్గా మధ్య కొచ్చేసరికి ఆమె ఊహించని సంఘటన ఒకటి జరిగిపోయింది. తేరుకుని చూసేసరికి అప్పుడే పదిమంది విద్యార్థులైతే సైకిళ్ళమీద వచ్చేసి, చుట్టుముట్టేసి నిలబడున్నారు.

'భలే. భలే. పిట్ట చిక్కిందిరా! ఇన్నాళ్ళకు' గుంపును చీల్చుకుని మాటలు వస్తున్నాయి. 'చిక్కాక. ఎక్కడకు పోతుందిరా.'

ఆమెకు ఒళ్ళంతా ముచ్చెమటల్లు పోసేశాయి.

'ఇప్పుడు నీ పంత చెల్లును నిపిస్తే నాకు దిక్కేవరు చిట్టితల్లీ!' అన్నాడొకడు ముందుకు వచ్చి.

'అన లిప్పుడు నీ అందమైన ఒంటిమీద చెయ్యేసినా. అడిగే నాథుడెవరు చెప్పు.'

'అబ్బా. ఏం నిక్కురా. ఆపాటి జీ యివ్వనే యివ్వదుట. బలవంతాన యిప్పుడు యిప్పించమంటావా, బంగారుకొండా!'

పారిగొట్టా తక్కిన తగ బందమయింది లావణ్యవని. 'నిజమే. యిప్పా అప్రాచ్యులు తన ఒంటిమీద చెయ్యేసినా తనకేది దారి?' ఆమె రెండుకళ్ళూ నీళ్ళతో నిండిపోయాయి.

'భగవంతుడా! నువ్వే దిక్కు నాకు. ఏడుకొండలవాడా! నువ్వే రక్షించాలి నన్ను' అనుకుంది రెండుకళ్ళూ గట్టిగా మూసుకుని.

ఆ శ్రీనివాసుడే ఆమె మొర ఆలకించాడో ఏమో? — మరుక్షణంలో వచ్చిన వాళ్ళు వచ్చినట్టుగానే నలుమూలలా వెళ్ళి చెదురైపోయారు. దూరంగా ప్రొఫెసర్ మధుసూధనరావు నాయుడుగారు స్కూటరుమీద వస్తూ కనిపించారు. ఆయనంటే ఆమాత్రం గౌరవం, భయభక్తులు, ఇంకా విద్యార్థులకున్నాయి.

ఆలాంటి పరిస్థితులే రెండు, మూడు సార్లు ఎదురవడం, ఆమె ఎక్కిన రిక్షాకు సైకిళ్ళు అడ్డంపెట్టి ముందుకు వెళ్ళనీయకుండా చేయడం, ఆమె వెనకాల పోటీ కొచ్చినట్టు అసభ్యంగా అరవడం, తగిలేంత దగ్గరగా విసిరే మాటకు రావడం — యిలాంటి సంఘటనలతో, కాలేజీకి వెళ్ళి రావడం అంటేనే, పెద్దగండం గడిచి బయటపడ్డంత పనవుతోంది, రానురాను.

ఎందుకొచ్చిన గొడవ. "యిహ పరీక్షలింక పదిహేనురోజులు లేవు గాబట్టి, కాలేజీకి వెళ్ళడం మానేసి, యింటిదగ్గరే ఉండి చదువుకుందామన్న నిశ్చయాన్ని కొచ్చింది ఆఖరికి. సరిగ్గా ఆవేళే ఆమె రికార్డులు కొన్ని మాయమైపోయాయి.

వయినా తీయవా వెదికించినా తిరిగి ఆ రికార్డులు యథాస్థానానికిరాలేదు. దానితో ఎక్కడలేని నైరాశ్యం ఆ అమ్మాయిని ఆవహించింది. చదువంటే విరక్తి కల్గి, పరీక్షల కెళ్ళే ఉద్దేశ్యాన్నే విరమించుకుంది, ఆ విరక్తిలోనే పెళ్ళికి తన అంగీకారం తెలియసేసింది — 'మీ యిష్ట ప్రకారమే కానివ్వండి. నా అభ్యంతరం ఏమీలేదు' అంటూ.

ముసలావిడ మహదానంద పడిపోయింది. 'ఏదో వాళ్ళ తాతగారిలా, కొంచెం పట్టుదల తప్పిస్తే, నా తల్లి ఏ మాటకాదంది? మంచివాళ్ళకుండాల్సిన లక్షణమంటే అది. ఈ చదువులు, కూడు పెడతాయా? గుడ్డ పెడతాయా? ఆడపిల్ల ఎప్పుడైనా ఒక



అయ్యేవేళలో? వెళ్ళాల్సిందేగదా.' అంటూ తృప్తిగా మనవరాల్ని దగ్గరకు తీసుకుంది.

అతి క్రూరంగా ప్రవర్తిస్తున్న విద్యుద్ఘాత ధాటికి ఆగలేక, చదువుకు తిలోదకాలిచ్చేసి, 'పెద్దవాళ్ళు చెప్పినట్టుగానే, పెళ్ళి చేసుకు స్థిరపడిపోదామని నిశ్చయానికొచ్చిన లావణ్యకు అదే దూరమైపోయింది.

కుదిరినట్టే కుదిరిన ఆ సంబంధం కొంచెమూ నెమ్మదిగా చెయ్యిజారిపోయింది. ఈ సంబంధమొక్కటే నన్నమాటేం?— దరిమిలా ఎన్ని సంబంధాలొచ్చినా ఒక్కటీ స్థిరపడలేదు. 'గడుగ్గాయి పిల్లట. కాలేజీలో మగరాయుడిలా తిరిగేదట. మగవాళ్ళనుపట్టుకు కొట్టేదటకూడా. ఎందుకొచ్చిన కర్మ! కొరివితో తల గోక్కోవడం!' అంటూ తిరిగి పోయేవారు కొందరు.

'కాలేజీలో ఆ అమ్మాయి ప్రవర్తన అంత బాగ్గా లేదట: ఏవో గొడవలు జరిగాయట. అందుకే పరీక్షలకు వెళ్ళడం మానుకుంది...ఎందుకొచ్చిన బెడద! ఆడపిల్లలకు లోకమేం గొడ్డుపోలేదు. చూసి చూసి యిలాంటి సంబంధమెందుకు?' అనుకుని వెనక్కు వెళ్ళిపోయేవారు మరికొందరు.

రెండవ కంటికి తెలీకుండా ఎంత రహస్యంగా పెళ్ళిచూపుల ఏర్పాట్లు జరిపినా, ఎలా తెలిసేదో ఏమో, అసలుకి యింకో నాలుగు చిలవలు ఊహించుకు ప్రచారంచేసి వెళ్ళిపోయేవారు, వచ్చినవాళ్ళంతా.

మరి కొంతమందయితే 'యిన్నాళ్ళూ చదివి పరీక్షలకెందుకు వెళ్ళనట్టు? ఇంత కష్టపడిన చదువూ ఆఖరిక్షణంలో వదులుకుంటారా?' అంటూ అనేకవిధాల సవాలక్ష ప్రశ్నలతో వేధించి మరీ వెళ్ళేవారు.

ఏకంగా విరామం లేకుండా నాలుగ్గేళ్ళు, చెప్పులరిగేలా కూతురికి పెళ్ళి సంబంధాలు చూశాడు లావణ్య తండ్రి. ఆఖరికి విసిగి, 'దానికింకా ఆ కళ్యాణ ఘడియ రాలేదంతే' అని నిరాశచేసుకు ఊరుకున్నాడు.

'దాని మొగుడింకా పుట్టలేదు' అని గుండె రాయిచేసుకుంది తల్లి.

'ఇంకీ జన్మకు పెళ్ళికాదు. ఆ గీత లేదంతే.' అంటూ నిట్టూర్చింది ముసలావిడ. లావణ్యమాత్రం, వీటన్నిటికీ అతీతురాలిలా, దూరంగా ఉండిపోయింది— దేనితోనూ తనకు సంబంధం లేనట్టుగా.

అన్నాళ్ళ కష్టపడి చదివిన చదువంతా, ఆవిరైపోయాయేమో.
ఎప్పుడైతే ఆఖరిక్షణంలో వదిలేసుకోవలసి నాలుగేళ్ళు గడిచాయి. ఒకనాడు
వచ్చిందో, అప్పుడే అస్థిరచిత్తత, గంభీరం లావణ్య మేనమామ దిగాడు. అప్పటికే


కేశరాజ్ హెయిర్ ఆయిల్



* అకాలములో జుట్టు నెరియుట, పలచబడుట, మరియు వూడిపోవుటలను మాన్పును.
* నిరంతర మానసిక పరిశ్రమవలన వేడెక్కి, మొద్దుబారిన మెదడును చలువచేసి పునర్జీవపరచును.
* ఎండ, నిద్రలేమి, మానసిక పరిశ్రమలవల్ల వచ్చు తలనొప్పి, కళ్ళుమంటలు, పోటు, నీరుకారుటలను మాన్పును.
* ఆరోగ్యవంతమైన కేశసంపదను వృద్ధి పరచి అందమును పెంపొందించును.
* కేశరక్షణకు, కేశపోషణకు, కేశవృద్ధికి, కేశ సౌందర్యమునకు సాటిలేనిది కేశరాజ్ హెయిర్ ఆయిల్.

మీ కేశములకు సంబంధించిన సమస్యలకు శాస్త్రీయమైన సమాధానం కావాలా?

వివరములతో ఉత్తరం వ్రాయండి

రిసెర్చి & ప్రూవింగ్సు డిపార్టుమెంటు:

డాక్టర్ వాసూ ప్రోడక్ట్సు,

రాజమండ్రి-2.



"కృష్ణా ట్యుటోరియల్స్"

51. చెల్ల పిళ్ళయార్ కోయిల్ వీధి,

రాయపేట ... మద్రాసు—14. ఫోన్: 81602

ప్రైవేటుగా చదివి

ఆంధ్ర, వెంకటేశ్వర, మరియు కర్నాటక విశ్వవిద్యాలయముల

* మెట్రిక్యులేషన్ * ప్రీ యూనివర్సిటీ

* బి. ఏ. పరీక్షలకు హాజరుకండి.

* దిట్టమైన పోస్టల్/పర్సనల్ ట్యూషన్ యివ్వబడును.
* ప్రొఫెసర్. ఎస్. కృష్ణ అయ్యర్, ఎం. ఏ., కే. సుందరం ఎం. ఏ., ఎం. ఇడి., మరియు యితర అధ్యాపకులు స్వయముగా తరగతులు నడుపుదురు.
* కాలేజీ "పుస్తక—బ్యాంకు" నుండి పోస్టుద్వారా మరియు స్వయంగా ట్యూషన్ పొందే విద్యార్థులకు భాషా పాఠ్య పుస్తకములు ఉచితముగా సప్లయి చేయబడును.
* ఆంధ్ర మెట్రిక్ — తెలుగు, ఇంగ్లీషు భాషల రెంటిలో తర్ఫీదు యివ్వబడును.
* ఇతర కోర్సు లన్నియు ఇంగ్లీషు భాషలోనే బోధింపబడును.

ప్రాస్పెక్టస్‌కై 0—50 పైసలు మనియార్డరు పంపండి.

ఎస్. కే. అయ్యర్, ఎం. ఏ.

ప్రిన్సిపాల్.




పుస్తకములు

5 పుస్తకముల పెట్టె రు. 5-50
(1) కొక్కోకశాస్త్రం (2) సుహాగ్ రాత్ (3) ముద్దు పద్ధతులు, (4) 84 ఆసనములు, (5) రహస్యఫోటో ఆల్బం. ఒక్కొక్క పుస్తకం రు. 2/-. పోస్టేజి, ప్యాకింగ్ అదనం. ఇంగ్లీషులో వ్రాయండి.

SULEKHA TRADERS.
(WAT-7) Beat No. 13 Aligarh.

వాయిదాలపద్ధతిపై ట్రాన్సిస్టర్

నెలకు రు. 30/- వంతున చెల్లించి "నేషనల్" పోర్టబుల్ 3 బ్యాండ్, ఆల్ వరల్డ్ ట్రాన్సిస్టర్ పొందండి. దీనికి పగులనట్టి ప్లాస్టిక్ పెట్టె కూడా వుండగలదు. వెంటనే వ్రాయండి.

Jagson Agencies (WAP-88)
P. B. 1212, Delhi-6.

తెల్లమచ్చలకు ఉచిత వైద్యము

శక్తివంతమైన మా ఆయుర్వేద ఔషధము "SWETARI" తెల్ల మచ్చలను కొద్ది రోజులలో తొలగించును. సాంఘిక సంక్షేమం కొరకు 1000 రోగులకు ఒక్కొక్క పాకెట్ ఉచితంగా యివ్వబడును. వెంటనే వ్రాయండి.

Sri Krishna Chandra Vaidya
(A. F.) P. O. Katrisarai (Gaya)

## చంపఛెళ్లుమంది

లక్ష్మిగారి ప్రోత్సాహంతో, బి.ఏ ప్రయివేటుగా కట్టి పూర్తిచేసిన లావణ్య — 'మళ్లీ ఏ సంబంధం వేసుకొచ్చాడో భగవంతుడా?' అనుకుంది భయంగా. కాలేజీలో తన నడత గురించి శంకించి యింతమంది పెళ్లికొడుకులు వెళ్లిపోగా లేనిది, యితడుమాత్రం వెళ్లడని నమ్మకమేమిటి? అనుకుంది నిస్పృహగా.

అవతలి గదిలోంచి మామయ్య గొంతు గట్టిగా వినిపిస్తోంది.

—దీనితో లటోయిటో తేలిపోతుంది. ఆ భగవంతుడిమీదే భారమంతావేసి చూద్దాం. ఇదే మన ఆఖరి ప్రయత్నం కూడా. ఇది తప్పకుండా జరిగితీరుతుందని, నాకెందుకో చాలా నమ్మకంగా ఉంది బావగారూ!... కుర్రాడూ లక్షణంగా ఉన్నాడు. డాక్టరేట్ తీసుకుని మొన్నే విదేశాలనుంచి వచ్చాడు, హైదరాబాదు. దూరంగా ఉంటున్నారు గాబట్టి, మనమ్మాయిమీదున్న పుకార్లు, గొడవలు అంతదూరం, వాళ్లవరకూ వెళ్లి ఉండవు. రేపు మధ్యాహ్నానికి దిగుతాడు అబ్బాయి తల్లితో. రెండవ కంటికి తెలీకుండా పెళ్లిచూపులు జరిపించేసి, పదిరోజుల్లో ఏదో చాలా మంచి ముహూర్తముందంటున్నారు. దానికే తంతు జరిపించేద్దాం. ఏమంటారు?—వాళ్లకు కట్నాలాశ కూడ అంతగాలేదు. పిల్ల చదువుకుని అందంగాఉంటే చాలట.'

విని, వచ్చినది వచ్చినట్టుగానే నిశ్శబ్దంగా వెనక్కు తిరిగి వెళ్లిపోయింది లావణ్య.

ఆ సాయంత్రం పెళ్లిచూపులకేర్పాట్లు జరిగాయి. నిరాశ, నిస్పృహ వైరాగ్యాలతో తలవంచుకుని, పెళ్లికొడుక్కు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది లావణ్య. అందంగా కుందనపు బొమ్మలా ఉన్న ఆ అమ్మాయిని, కొడుకు ప్రక్కగా ఊహించుకుని, యీడూ జోడూ ఎంతబాగుంది! అంటూ ముచ్చటగా చూసుకుంది పెళ్లికొడుకు తల్లి.

'నా అభ్యంతరం ఏమీలేదండీ. సంబంధం ఖాయపర్చి, ముహూర్తాలు నిర్ణయం చేయవచ్చు. ఏమంటావమ్మా?'—అన్నాడు పెళ్లికొడుకు.

'అవును. ఈ ఎండల్లో యింత దూరం మళ్లీ వచ్చి ముహూర్తాలు పెట్టుకోవడం, అది లేనిపోని శ్రమ. అబ్బాయిలూ, అల్లుళ్లూ ఏకంగా తలపుపెట్టి అప్పుడే వస్తారు...మళ్లీ యిప్పుడు తలపెట్టడం, రావడం అంటే చాలా నష్టం కూడా' అందావిడ.

ఇంత సునాయాసంగా యీ పెళ్లి సమస్య పరిష్కరింపబడి పోతుందని కలలో కూడా అనుకోని వాళ్లందరికీ, ఒక్కక్షణం నోటమాట రాలేదు.

అందగాడట. విదేశాలలో చదివి వచ్చాడట. పైగా శ్రీమంతుడట తనను చూడగానే ఒక్కమాటైనా అడగకుండా, యీనాటి పెళ్లికొడుకుల్లా లక్ష పరీక్షలు పెట్టక, అంతకుమించి ప్రశ్నలతో వేధించక, గొంతెమ్మకోర్కెలు కోరకుండా, ఎంతో సూక్ష్మంగా అంగీకారం తెలియచేశాడు! తానెంత అదృష్టవంతురాలు!

గుండెలు వేగంగా కొట్టుకుంటూంటే సిగ్గుతో లోపలకు పారిపోదామని వెనుక్కు లేచి నిలబడింది. వెళ్తూ వెళ్తూ ఒక్కసారి... ఆ దయామూర్తిని — ఆ సంస్కార హృదయుడిని — తీవ్రతతో తన జీవితాన్నంతా అర్పించదలచిన ఆ అబ్బాయివైపు కళ్లెత్తి సిరగా చూసింది. అంతే ... చిరునవ్వుతో తనవైపే చూస్తున్న ఆ యువకుడిని చూసి, నోటమాటరాక స్తంభించి పోయింది మరుక్షణంలోనే.

అతనే సందేహంలేదు.. తను ఎవరివల్లైతే ఆనాడు తలవంపులపాలైందో, ఎవరి వల్లనైతే తన జీవితనావ తల్లక్రిందులైపోయిందో— తన నాశనానికి పరోక్షంగా ఎవరు కారకులో?— ఆ అబ్బాయే. గోపాలకృష్ణ!'

'వద్దు. వద్దు. ఈ పెళ్లి చేసుకోనని చెప్పెయ్యి.' అని ఎవరో అరుస్తున్నట్టుంది మనస్సులోంచి.

ఆ కసి లోపలపెట్టుకుని, నిస్సహాయంగా నిందవానికే, మారు మాటాడకుండా యింత శీఘ్రంగా అంగీకారం తెలిపాడు ... అప్పుడైతే పంతానికి పోయి పరీక్షలకే వీళ్లొద్దులనుకున్నావ్. ఆ ద్రోహిని యింకేం చేయగలవు?... మూడు ముళ్లూ పడ్డాక, అణచి పెట్టి రాచిరంపాన పెట్టగలడు జాగ్రత్త. 'ఎవరో వేయిగొంతులు పెట్టి చెవి దగ్గరగా అరుస్తున్నట్టు ఉంది

లావణ్య మెడలో మూడు ముళ్ళూ బిగిసిపోయాయి.

మొదటిరాత్రి.

—అదురుతున్న గుండెలను గుప్పెట్లో పెట్టుకుని, అతనితో, తన సంసార జీవితంలో ఎదుర్కోబోయే పెనుతుఫానులను ఊహించుకు, కలవరపడుతూ, తలుపుదగ్గర నిలబడింది లావణ్య.

అప్పుడైతే పంతంతో పట్టుదలగా అతనికి ఎపాలజీ యివ్వలేదు సరిగదా, వాళ్ళ కుటుంబం కూడా లొంగకుండా, పరిస్థితులు విషమిస్తే, చదువునుంచే నిష్క్రమించగల్గింది. కాని ఇప్పుడో? శాశ్వతమైన యీ బంధాన్ని తెంపుకునెక్కడకుపోతుంది? ఇప్పుడెలా తప్పించుకో గలదు?

అతను తన భర్త. అగ్నిసాక్షిగా తన మెడలో మూడుముళ్ళూవేసిన జీవితభాగస్వామి. ఇప్పుడింక యేవిధంగానూ అతనినుంచి తను తప్పించుకోలేదు. ఆ కక్ష, ప్రతీకారం యిప్పుడు తీర్చుకుంటాడు. ఆనాడు పెళ్ళిచూపు లప్పుడు ఎంత హుషారుగా ఉన్నాడు! తనమీద పగ సాధించడానికే మారు మాటాడకుండా ఒప్పుకున్నాడు. పెళ్ళిపీటలమీద కూడా ఎంత విజయగర్వంగా కూర్చున్నాడు! ముల్లోకాలనూ జయించినంత ధీమా కనిపిస్తోం దతని ముఖంలో.

లేదు. ఇంకే అడ్డూలేదు అతనికి. తను పూర్తిగా అతని సొత్తు. అతనిష్టం.

అతను లేచివచ్చి రెండు తలుపులూ లోపల గడియ పెడుతుంటే. ఒక్క క్షణకాలం ఆమె హృదయకవాటాలు, రక్తప్రసరణమర్చి పోయాయి. అతను తనను సమీపించేకొలదీ నిస్సత్తువతో నరసరాలూ క్షీణించిపోయినట్టు గుండె ఆగిపోతోన్నట్టు అనిపించసాగింది. అతను మరీ దగ్గరగా వచ్చేశాడు. ఆమె ఊపిరి బిగబట్టింది. 'ఆనాడైతే తప్పించుకున్నావుగాని, యిప్పుడెక్కడికి తప్పించుకోగలవు లావణ్యా!' అంటూ ముందు చంపఛెళ్ళు మనిపిస్తాడనుకొంది!

'లావణ్యా!'

ఉలిక్కిపడింది లావణ్య. ఏవేవో ఆలోచనలతో, మనశ్శాంతికి దూరమై, అలమటిస్తోన్న ఆ తప్తహృదయానికి, ఆప్యాయమైన ఆ పిలుపు, పన్నీటి జల్లులా వినిపించింది.

'నన్ను గుర్తుపట్టావా?' రెండు చేతులతో ముట్టేస్తూ అడిగా డతను.

అనురాగాన్ని చిందిస్తోన్న ఆ పిలుపుకు ఆమె రెండుకళ్ళూ నీళ్ళతో నిండిపోయాయి.

'ఛీ ఛీ ఛీ. ఇదేమిటి?... ఇలాంటి శుభసమయంలో — అందులోనూ మొదటిరాత్రి!... కళ్ళనీళ్ళెందుకు లావణ్యా?' ఆప్యాయంగా కళ్ళొత్తి, దగ్గరకు తీసుకున్న అతని వక్షస్థలం మీద వాలిపోయింది నిలబడలేక.

తను కలగనడంలేదుగదా? 'ఎంత మంచివారు మీరు! నేను అర్థంచేసుకోలేక ఆనాడు మూర్ఖంగా ప్రవర్తించాను. నన్ను క్షమించరూ?' అంది అతనికి మరింత అతుక్కుపోతూ.

అత నామె గెడ్డం పట్టుకుని మృదువుగా తలపైకెత్తాడు. 'పిచ్చిదానా!... ఇంకా నువ్వు ఆనాటి సంఘటనలేవీ మర్చిపోయినట్లు లేదే? ఇంతకాలం అవే మనస్సులో పెట్టుకుని మధనపడుతున్నావా?

—అయినా నువ్వేం చేశావని క్షమించడం? న్యాయానికి ఆత్మసమర్పణ అడగాల్సింది నేను.' అత డేదో ఆలోచిస్తూ కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయి, తిరిగి అన్నాడు. 'స్నేహితుల గొడవ పడలేక, ఆ వేళ నిన్ను ఎపాలజీ అయితే యిమ్మని అడగడానికి వచ్చానుగాని, ఆతర్వాత పరీక్షగొడవలో పడిపోయి, ఆ విషయాలే పూర్తిగా విస్మరించేశాను. తర్వాత నా పేరుతో, కొందరు నా మీద చాలా దౌర్జన్యం జరిపారని, ఫలితంగా నువ్వు పరీక్షలకే మానుకున్నావని, అంతా అయాక తెలిసింది నాకు. చేతులు కాలాక ప్రయోజన మేమిటి?

'అంత తెలివైన నీవు, పరీక్షలకు వెళ్ళడం మానేశావా అంటే, ఏ బలమైన కారణమో ఉండేవుండాలి. అందుకు పరోక్షంగా బాధ్యుడిని నేను. ఎంత పొరపాటుచేశాను. ఒకరి పురోభివృద్ధికి నాశనకారి నయ్యాను' అని ఆ సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నా మనస్సు గిలగిల్లాడిపోతుంది. నీ కన్యాయం జరిగిపోయిందే అని యింతకాలం ఆక్రోశిస్తోన్న నాకు, పెళ్ళికూతురి స్థానంలో నువ్వు కనిపించేసరికి వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. నా స్థితి ఏం వర్ణించను! ప్రయివేటుగా చదివి, బి.ఏ. పాసయ్యావని వినగానే, నీ పట్టుదలకు, నీమీద మరింత గౌరవం కల్గింది.

ఇప్పి నేనే వేయించి ఉంటానని, నీ చదువు నాశనాన్కి కారణం నేనేనని, నామీద అసహ్యం పెంచుకుని ఉండివుంటావు. నీకు జరిగిపోయిన అన్యాయం ఒకరు తీర్చగల్గేది కాదు; నిజమే. కాని నా నిర్దోషిత్వాన్ని బుజువు చేసుకోవాలంటే మార్గం మరోటి లేదు.

నిన్ను పెళ్ళి చేసుకుని, కొంత పాపభారం తగ్గించుకుందామన్న స్వార్థంతో వెంటనే ఒప్పేసుకున్నాను. ఎంత త్వరగా నిన్ను మరొక రెవరూ ఎత్తుకుపోకముందే నాదాన్ని చేసేసుకోవాలా? అని ఊ తొందరపడి పోయానసుమా....

ఇదీ కథ. అంతేగాని నీమీద నాకు కోప మెందుకు లావణ్యా! నిన్నింత హైరాన పెట్టిన యీ దీనుణ్ణి క్షమించి దరిజేర్చుకుంటావో లేక మళ్ళీ 'చంప' ఛెళ్ళుమనిపిస్తావో?' అంటూ బుగ్గ అందించాడు చిరునవ్వుతో. ●



**జరిగిన కథ**

యస్. యస్. యల్. సి. పరీక్షల్లో — కాపీలు పట్టుకుంటాడు శంకరం మేష్టారు. శంకరం గారి మంచితనాన్ని గ్రహించిన వేణు అక్కయ్య జ్యోతి వేణుని శంకరంగారి దగ్గరకి ట్యూషనుకు పంపిస్తుంది. జ్యోతి, బావ ఆనందరావును వివాహం చేసికొంటుంది. కారణం లేకుండానే శంకరానికి వరదరాజులు ప్రత్యర్థిగా తయారవుతాడు. ఆనందరావు, తమ్ముడు రంగడికి విద్యాబుద్ధులు గరపాలనే వుద్దేశంతో తనదగ్గరకు రప్పిస్తాడు. శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన చాలవరకు మారిపోయింది. అతను ఆక్స్ఫర్డు క్లాసుల్లో మార్కులు పైవలు పొందయ్యాడు.

## 12

ఈ మధ్య చిన్నబోయిన రైలుకట్ట మళ్ళీ కళకళలాడుతోంది. వేణు కట్టమీద కూర్చున్నాడు. ప్రక్కనే నలుగురైదుగురు కుర్రాళ్ళు వున్నారు...అందులో ఒకడు కట్టమీద రాళ్ళుతీసి ఎలక్ట్రిక్ స్తంభానికేసి కొడుతూ ఆనందిస్తున్నాడు...

వేణు హుషారుగా కబుర్లు చెబుతున్నాడు... కాలరు పైకెత్తి, చొక్కాచేతులు మోచేతుల దాకా మడిచి. క్రాపు మొహం మీదపడేలా బఫ్ దువ్వుకుని వరదరాజులు యింటిముందు వాలుగ్గైదుసార్లు తిరిగితే ఆయన తలవంచుకు ఎలా వెళ్ళిందీ అందరికీ విశదంగా చెబుతున్నాడు వేణు.

సుబ్బులు మార్కులు విరగ్గొట్టించిన సందర్భాన్ని పురస్కరించుకుని క్రితంరోజునే తన బావి వాళ్ళందరికీ 'పార్టీ' యిప్పించాడు వేణు ... వేణు చేయించిన 'ఘన కార్యం' విని ఫ్రెండ్స్ అందరూ ఎంత సంతోషించిందీ సగర్వంగా చెప్పుకుంటున్నది మిత్రమండలి.

'అరేయ్!... వేణూ!...' కొన్ని గజాల దూరం నుంచీ హడావుడిగా పిల్చుకుంటూ వచ్చాడో మిత్రుడు సైకిల్‌మీద రొప్పుకుంటూ రొజుకుంటూ...

స్నేహితులంతా ఆదుర్దాగా చూశారు అతడి కళ్ళల్లోకి...

'ఒరేయ్! మీ శంకరం మేషార్ని ... పోలీసుస్టేషనుకు ... పట్టుకుపోయ్యారట... మా వెంకటేష్‌గాడు చూశాట్ట... వాడొచ్చి యిప్పుడే చెప్పాడు...వెంటనే...సైకిలేసుకుని వచ్చా...' ఆయాసపడుతూనే చెప్పాడు...

'ఆఁ!!' అన్న వేణు మారు మాట్లాడ



కుండా మిత్రుడి చేతిలో సైకిల్ తీసుకుని యిద్దరూ ఆ సైకిల్ మీదే బయలుదేరారు...వాళ్ళ వెనకాలే మిగతావాళ్ళు కూడా కాలినడకన బయలుదేరారు. మంచి స్పీడు మీద పోతున్న వేణు 'డబుల్స్ వస్తున్నారని కానిస్టేబిల్ విజిల్ వేస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళి 'స్టేషను' చేరుకున్నాడు... సైకిల్ మిత్రుడికి వప్పగించి ఏకాఎకి స్టేషనులోకి వెళ్ళాడు వేణు...

లోపల శంకరంగారు, వరదరాజులుగారు, సుబ్బులు. వాళ్ళను చూసి క్షణంలో జరిగిందంతా గ్రహించాడు వేణు. వరదరాజులుగార్ని, సుబ్బుల్ని మిర్రుమిర్రున చూసి, తర్వాత శంకరంగారి నుద్దేశించి, 'మేషారూ! మీరిక్కడికెందుకు వచ్చారండీ?' అని అడిగాడు.

వేణును చూడగానే వరదరాజులుకూ, సుబ్బులుకూ పై ప్రాణాలు పైనే పోయినయి. ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు వాళ్ళు. బాణంలా దూసుకొచ్చిన వేణును, అతడు రాగానే మాడిపోయిన వరదరాజులుగారు సుబ్బులు మొహాలు చూసి, అంతదాకా వరదరాజులు చెబుతున్నది వింటున్న సబ్‌ఇన్‌స్పెక్టరు కలుగజేసుకుని, 'మిస్టర్!... ఈ శంకరంగారు మీకు తెలుసా?...' అని అడిగారు వేణును:

'నాకు తెలుసండీ ... ఈ వరదరాజుల్ని కూడా బాగా ఎరుగుదును'... ఏవగింపుతో వరదరాజులుగార్ని చూపిస్తూ చెప్పాడు వేణు.

వేణు వరదరాజులుగారికి ఏకవచనం వుపయోగించినందుకు బాధపడుతూ మందలిస్తూ చూశారు శంకరంగారు.

'అయితే—ఈ శంకరంగారికి ఆయన మీద చాలా రోజులుగా కక్ష వుందిట... నిజమేనా?...' అని మళ్ళీ ప్రశ్నించాడు ఎస్. ఐ.

'లేదండీ...నాకు తెలిసినంతవరకూ యీ వరదరాజులుగారే చాలారోజులనుండీ శంకరం గారిమీద కక్షసాధిస్తున్నారు' అని చెప్పాడు వేణు వీలయినంతవరకూ శాంతంగా మాట్లాడ్డానికి ప్రయత్నిస్తూ....

'కారణం?'

'శంకరం మేషారంటే స్కూల్లో పిల్లలకు ప్రత్యేకమైన అభిమానం. అది ఈయనకు కన్నెర్రగా వుంది...'

'ఊఁ...తర్వాత?...'

'అందుకని శంకరం మేషారిని అవమాన పర్చాలని...'

'మరి యీ శంకరంగారు, వీళ్ళబ్బాయిని కొట్టించారని వరదరాజులుగారు 'కంప్లయింట్' చేస్తున్నారు?'

'ఉత్తది ... అబద్ధం...కొట్టించింది ఆయనకాదు...'వేణు ఆవేశంగా అన్నాడు.

'అయితే కొట్టించిం దెవరు?' వెంటనే ఎస్. ఐ. ప్రశ్నించాడు.

'నేను' అన్నాడు వేణు నిర్భయంగా.

శంకరంగారు తెల్లబోయి వేణువైపు చూశారు. 'వేణూ!...నువ్వు కొట్టించావా? ఎందుకు వేణూ!... ఎందుకిలాంటి పని చేశావ్?...'అని అడిగారు బాధగా...బాగు పడ్డాడనుకున్న వేణు మళ్ళీ మొదటి కొచ్చాడేమో అని...

'అవును మేషారూ!...నేనే కొట్టించాను' వేణు నదురుబెదురూ లేకుండా శంకరంగారి వైపు చూస్తూ అన్నాడు....'ఎందుకు కొట్టించానంటారా?...ఈయన... ఈయన మూలానే మీబాబు, రఘుబాబు చచ్చిపోయ్యాడు...ఆడుతూ పాడుతూ కబుర్లు చెప్పే బాబును తల్చుకున్నప్పుడల్లా, నాకు యీయనకు బాగా శాస్తి చెయ్యాలనిపిం

లింది. అందుకే ప్రతీకారం చేశాను...మీకు తెలిస్తే ఒప్పుకోరని...మీకు తెలియకుండా ...చేశాను...'

'బాబెవరు? ఆయన కారణమేమిటి? ...ఏమిటి మిస్టర్!...అంతా 'కాంప్లికేటెడ్' గా వుందే?' ఎస్.ఐ. వేణును కుతూహలంగా అడిగాడు.

వేణు జరిగినదంతా ఆయనకు వివరించి చెప్పాడు...అఖరికి, మీరు చెప్పండి... ఆయన తన దగ్గర డబ్బువుంచుకుని లే దన్నాడు...ఎందుకు?...ప్రాణాలమీద కొచ్చి నప్పుడు యివ్వకుంటే బాబు చచ్చిపోతాడు, పోనిమ్మనికాదూ?...' అంటూ సూటిగా ఆయన్ని అడిగాడు వేణు.

వరదరాజులుగారి గుండె గతుక్కుమంది. నా దగ్గర డబ్బుందని ఎవరు చెప్పారునీకు? అప్పుడు నా దగ్గర చిల్లిగవ్వ కూడాలేదు...' అన్నారాయన... 'నిజంచెప్పు... నీ దగ్గర ...అప్పుడు రెండొందల రూపాయలు లేవూ?' అన్నాడు ఆవేశంగా రెండడుగులు ముందుకేస్తూ వేణు.

'వేణూ!'...శంకరంగారి కంచు కంఠం గంటలా మ్రోగింది ఆగదిలో.

వేణు ఓ అడుగు వెనక్కువేశాడు. తన్ను తాను సంభాళించుకుని, 'నిజం చెప్పండి. అప్పుడు మీదగ్గర డబ్బుందిగదూ? మీరు సమయానికి సహాయం చేసుంటే బాబు బ్రతికే వుండేవాడు' అన్నాడు గద్గద కంఠంతో...వేణు. స్వరంలో వ్యక్తమౌతున్న బాధ, కళ్ళల్లో నిలిచిన నీటిబొట్లు. వేణు ప్రవర్తనకు నొచ్చుకుంటున్న శంకరంగారు, కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండావున్న వరదరాజులు గారు, బితుక్కుబితుక్కుమంటూ కూర్చున్న సుబ్బులు అందర్నీ జాగ్రత్తగా, మౌనంగా గమనిస్తూ కూర్చున్నాడు ఎస్. ఐ.

'ఎవరు చెప్పారోగానీ... నాదగ్గర డబ్బు లేదు...నేనేమన్నా లక్షాధికారినా ... ఒందలు ఒందలు యింట్లోపెట్టుకు కూర్చునేందుకు?...నేనూ శంకరంలా పాఠాలుచెప్పుకు బ్రతికేవాడినే...' వరదరాజులుగారు భేషజంగా మాట్లాడబోయినా స్వరం కంపిస్తూనే వుంది.

'అబద్ధాలు చెప్పకండి...శంకరం మేషారు అడగడానికిముందే మీ ప్రైవేటు పిల్లలు యిచ్చినవి రెండొందలులేవూ మీదగ్గర?... బట్టలుకొంటామనుకొని లేవన్నాను...' అలా మీరు మీ ఆవిడతో? ... చెప్పండి...నన్ను బుజావుచెయ్యమంటారా?...' అన్నాడు వేణు. అతడు నిగ్రహించుకునే మాట్లాడుతున్నా కళ్ళుమాత్రం అగ్నిగోళాల్లా మెరుస్తూనే వున్నాయి...

వరదరాజులుగారు తల వంచుకున్నారు. ఆయనకు ఏమనడానికీ పాలుపోలేదు ... ఇది వీడికెలా తెలిసింది?... బహుశా వారబ్బాయి చెప్పాడేమో అనుకున్నారు...మళ్ళీ ఆయనేదో



# ఘోరాసంధ్యా ప్రవర్తతే..

అనబోయేంతలో శంకరంగారు కలుగజేసుకుని, 'వేణూ!...ఏమిటిదంతా? అయిపోయిన పెళ్ళికి, బాజాల్లా గతించినవాటిని తల్చుకుని ఎవరైనా వినోదాలు తెచ్చుకుంటారా?... అయినా — నీపిచ్చి కాకపోతే — అంతా విధి విధానం! ... వాడికి ఆయుస్సువుంటే ఏదో విధంగా బ్రతికేవాడు...ప్రపంచంలో అందరూ మందులు లేకనే చస్తున్నారా?' శంకరంగారు పేలవంగా నవ్వుతూ అడిగారు.

'అంతా విధివిధానమనుకునేవాళ్ళు డాక్టరు దగ్గరకు ఎందుకు తీసుకువెళతారు? ఎలా జరుగుతుందో అలా జరగనిమ్మని ఎందుకు వూరుకోరు మేష్టారూ?...', శంకరంగారి మెట్టవేదాంతం నచ్చని వేణు సూటిగా ప్రశ్నించాడు.

'గాలిలో దీపంపెట్టి 'దేముడే రక్ష' అనము. మన ప్రయత్నాలు మనం చేస్తే, అది మనకో విధమైన ఆత్మసంతృప్తి... ప్రయత్నాలన్నీ విఫలమైతే ఆయుస్సు తీరిందని అనుకుని వూరుకుంటాం. అలా కాక మన ప్రయత్నలోపముంటే మిష దాని మీదికి తోసేసి తృప్తిపడతాము. అంతే వేణూ!...ఒకరి చావు బ్రతుకులకు ఒకరు కారకులనుకోడం వెర్రి... దానికోసం నువ్వీ విధంగా అమానుషంగా ప్రవర్తించడం నాకేం నచ్చలేదు వేణూ ... అయినా — అయన్ను నేను కోరింది సహాయం. ఆయనకు యిష్టముంటే, వీలయితే చేస్తారు... లేకుంటే లేదు. సహాయమన్నది ఐచ్ఛికమే గాని నిర్బంధం కాదే?...'

'లెటజ్ కమ్ టు ది మేటర్!... మిస్టర్!... నీపేరు?...' మధ్య ఎస్. ఐ. కల్పించుకుని అడిగాడు.

'వేణుగోపాల్.'

'అయితే వరదరాజులుగారి అబ్బాయి సుబ్బారావును కొట్టించింది నువ్వేనని ఒప్పుకుంటున్నావ్ కదూ?'

'అవును ఒప్పుకున్నాను.'

'నువ్వు చేసింది తప్పేనని కూడా ఒప్పుకుని పశ్చాత్తాప పడుతున్నావు గదూ?...'

'తప్పా!!... తప్పెందుకవుతుంది? ... ఆయన కొడుక్కి నాలుగు దెబ్బలు తగిలితేనే ఆయన ప్రాణం యింత గిజగిజలాడిపోతోంది. ఇంక శంకరం మేష్టారికెలా వుండాలి!...అది గ్రహించి వరదరాజులుగారే పశ్చాత్తాపపడాలి...'

'అయితే సుబ్బారావుకు క్షమాపణ చెప్పుకోడానికి నువ్వు సిద్ధంగా లేవన్నమాట!...'

'క్షమాపణ చెప్పుకోవలసింది నేను కాదండీ...ఆయనే మా శంకరం మేష్టారికి చెప్పుకోడం మంచిది.' అని వేణు నిక్కచ్చిగా చెప్పేశాడు.

'వేణూ!...ముందు నువ్వు ఎవరి దగ్గర ఎలా మాట్లాడాలో నేర్చుకోడం మంచిది.' అన్నారు శంకరంగారు కోపంగా. ఎన్నడూ లేంది శంకరంగారి కళ్ళల్లో ఎర్రజీరలు కన్పిస్తున్నాయి...వేణు తలవంచుకున్నాడు...

'మిస్టర్ వేణుగోపాల్!... నువ్వు చేసింది నీ దృష్టిలో తప్పుకాకపోయినా చట్టరీత్యా తప్పు. దాన్నిబట్టి తగుచర్యలు తీసుకోవల్సి వుంటుంది సిద్ధమేనా?...' అని అడిగాడు ఎస్. ఐ. అతడికి కూడా కొంత వరకూ నిజానిజాలు తెల్సిపోయినయి. అందుకే వేణు ఎంత ఆవేశంగా మాట్లాడినా అతను మాత్రం చాలా ఓర్పుతో వింటున్నాడు. అతడికసలలా ముక్కుకు సూటిగా పొయ్యే వాళ్ళన్నా, కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడేవాళ్ళన్నా యిష్టం.

వేణు నిర్భయంగా ఆయన ముందు నిలబడి, 'చేసింది నేను. నాకది తప్పులా తోచటంలేదు. అయినా చట్టరీత్యా తీసుకోవాలంటున్నారు కాబట్టి నా మీద మీరే విధమైన చర్యలు తీసుకున్నా నాకిష్టమే... కానీ మా మేష్టారిమీద మాత్రం ఏవిధమైన చర్య తీసుకోదల్చినా, ఏ హాని తలపెట్టదల్చినా నేను సహించను.' అని నిష్కర్షగా చెప్పేశాడు వేణు.

ఆ మాటలు వరదరాజులుగారి కుద్దేశించినవని ఎస్. ఐ. సులువుగా గ్రహించి ముసిముసిగా నవ్వుకున్నాడు.

వరదరాజులుగారికి మాత్రం తను శంకరం మీద కక్ష తీర్చుకోవాలంటే అది వేణుగాడి మీదికి పోయిందే...వీడు మళ్ళీ ఏం కొంపమీదికి తెస్తాడోనని భయంగా వుంది. సుబ్బులు రాయిలా తండ్రి ప్రక్కన కూర్చున్నాడు. వేణు యిలా మధ్యలో వచ్చి 'చేసిందంతా నేనని' ఒప్పుకుంటాడని కలలో గూడా అనుకోలేదతను. ఇంకా తనపేరు యిరికించి తన్ను బయటకు లాగనందుకు వేణు నంతోషిస్తాడనుకున్నాడు!...

'మేష్టారూ!...' ఎస్. ఐ. శంకరంగారి నుద్దేశించి. 'మీ శిష్యుడు ఏ చర్యలు తీసుకున్నా ఫర్వాలేదని నిర్భయంగా చెబుతున్నాడు... 'కంప్లయింట్ బుక్' చేసుకోమంటారా?' అని అడిగాడు. అతడికీ శంకరంగారంటే ఓ విధమైన గౌరవం ఏర్పడింది.

'నా శిష్యుడు నిజాన్ని నిర్భయంగా ఒప్పుకున్నాడు. చట్టవిరుద్ధమైన పని చేసినప్పుడు చట్టరీత్యా శిక్ష అనుభవించ






# అందరు స్త్రీలకీ తెలుసు...కొన్ని సమయాల్లో కేవలం నివారణ మాత్రమే సరిపోదు...

ఒక్కొక్కప్పుడు సారిడన్‌తో వేదదేర్చుకొనె <u>అవశ్యకత</u> స్త్రీలకు వుంటుంది. మీకు ఎక్కువ మాంద్యము, నిరుత్సాహము లేక బాధ వున్న యెడల ఒకే ఒక-సారిడన్ భారాన్ని తగ్గించి, ఉత్సాహాన్ని స్తుంది. సారిడన్ నొప్పిని, దానివలన కలిగే శ్రమను పోగొట్టును. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! మీరు శక్తితో ఉత్సాహపూరితులై వుంటారు...సరిగ్గా ఆలోచించ కలుగుతారు..., స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు!

ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, వేదదేర్చును, నవోత్సాహమును కలిగించును. అందరు. స్త్రీలు నిశ్చయమైన నివారణకు సారిడన్ మీద ఆధారపడవచ్చు. తెలివిగా తలనొప్పి, పంటినొప్పి మరియు ఒంటినొప్పికి కూడ ఎల్లప్పుడూ <u>సారిడన్</u>ను మీ దగ్గర వుంచుకోండి.

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్

VT. 5530 తె

ఆరోగ్య అనారోగ్య
పరిస్థితులలో మహిళలు
ఆరోగ్య సౌభాగ్యములకు ఆధారపడునది
లోధ్ర
60 సంవత్సరములపైగా ప్రసిద్ధినొందినది
కేసరి కుటీరం
(ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14
ఏజెంట్లు
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ - సికిందరాబాదు - మధుర
బరహంపురం - బెంగుళూరు



ఏజెంట్లు కావలెను

ప్రఖ్యాత 'నేషనల్ డీలక్స్' ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్ 35% కమిషన్ పద్ధతిపై విక్రయించుటకు ఏజెంట్లు కావలెను. ఉచిత ట్రాన్సిస్టర్‌నకు వ్రాయండి.

ROMAR AGENCIES
P.O. Box 1441, (AP 27) Delhi 6.



3 నెలలు ఉచిత బహుమతి

స్త్రీలకు అందాన్నిచ్చే కాశ్మీర్ ఆర్ట్ చీరెలు, సరికొత్త డిజైన్లు చేయి మెరిసే నమూనాలతో రంగులలో యీ బుటువులు తగినట్లుగా మా వద్ద గలవు. మెట్టు పై దారాలతో ప్రామాణికమైనవి. 1 సెక్స్-చీరెలు 11 రు.2 రు.20లు; 3కి రు. 28లు; 4కి రు. 36/- రెండు లేక అంతకు పైన ఆర్డరు పంపిన వారికి బ్లౌజు గుడ్డ ఉచితం. మీ ఆర్డరును పోస్టు పార్శిల్ ద్వారా పంపెదము
ARVIND AGENCIES (APW-22)
P. B. 1408 Delhi 6


# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

వలసిందే... మీ యిష్టం. మీరు తీసుకో దల్చిన చర్యలు మీరు తీసుకోండి' అన్నారు. అలా అంటున్నప్పుడు వేణు విజయులైన కించిత్ గర్వం, పోలీసుల కిమ్మట్లోకి వేణు ఎక్కుతాడేమోనన్నబాధ, రెండూ మిళితమై ఏమీ చెయ్యలేక ఒక నిట్టూర్పు విడిచాడు.

'చూడండి. వరదరాజులుగారూ!...' ఎస్. ఐ. అయన్ను సంబోధించి గంభీరమైన కంఠంతో, 'మీరంతా విద్యావంతులు, సంస్కారం కలవారు...సభ్యత తెలిసినవారు. ఒకరికి చెప్పవలసినవారేగాని, ఒకరిచేత చెప్పించుకోవల్సినవారుకారు. పైగా మీ యిద్దరూ ఒకే స్కూల్లో పనిచేస్తున్నారు కూడా! ఇలాంటి విరోధాలు మీ యిద్దరి మధ్యా రానేరాకూడదు. వచ్చినా మీలో మీరు సర్దుకోవాలిగాని, మాదాకా రానివ్వడం ఏమంత బాగుండలేదు.' అని చెప్పి ఆయన మొఖంలోకి చూచాడు. వరదరాజులుగారి మొఖం వివర్ణమైంది. ఆయన తలవంచుకున్నారు.

ఎస్. ఐ. మళ్ళీ శంకరంగారివైపు తిరిగి, 'ఏమండీ!... ఇది మీ స్టూడెంట చిన్న తనపు దూకుడులో చేసినపని. అదీ మొదటిసారి... మీరు గనుక యికముందు అతడిలాంటి పన్లు చెయ్యకుండా చూస్తానని హామీ యిస్తే యీసారికి అతణ్ణి క్షమించి వదిలేసే అవకాశం వుంటుంది...ఏమంటారు మేష్టారూ?' అని అడిగాడు.

'ఇక ముందు ఎప్పుడూ మా వేణు యిలాంటిపన్లు చెయ్యకుండా చూసే బాధ్యత నాది. అది మాత్రం హామీ యివ్వగలను.' అంటూ సంతోషంతో వూపిరిపీల్చారు శంకరంగారు.

వేణు పులిక్కిపడి మేష్టారివైపు చూశాడు... 'యీయన తనమీద యింత భరోసా వుంచుతున్నారేమా పని?...'

'ఆల్ రైట్! వరదరాజులుగారూ!...పసింది తప్పని వేణుగోపాల్ ఒప్పుకుంటున్నాడు. ఇక ముందు అతడిలాంటి దూడుకుపన్లు చెయ్యకుండా శంకరం మేష్టరు హామీ యిస్తున్నారు. కాబట్టి మీరు విన 'కంప్లయింట్ విత్‌డ్రా' చేసుకోడానికి ఏమిటి అభ్యంతరం?' అని ఎస్. ఐ. అడిగిందానికి ఏమీ అనలేక సరేనని తలూపారు వరదరాజులుగారు.

'ఇక మీరు వెళ్ళవచ్చునండీ...' అని అందరితో చెప్పి, వేణు భుజం మీద దయగా చెయ్యవేసి, 'మిస్టర్! ఏం చదువుతున్నావ్?' అని అడిగాడు ఎస్. ఐ.

'స్కూలుఫైనలు మొన్ననే అక్టోబరులో పాసయ్యానండి.'

'అంటే వచ్చే సంవత్సరం కాలేజిలో చేరబోతున్నానన్నమాట! ముందు ముందు వృద్ధిలోకి రావల్సినవాడివి. ఇలాంటి విషయాల్లో మనసు పర్చించుకోడం మంచిదికాదు. న్యాయం అన్యాయం, తప్పు—ఒప్పు అనేది చూసేందుకు పైన భగవంతుడున్నాడు... మా దృష్టికి తప్పినప్పుడు దర్యాప్తు జరపడానికి మేమున్నాం. శిక్షించడానికి న్యాయాధికారులున్నారు. నువ్వు నీ చదువు, నీ భవిష్యత్తు చూసుకో...' అంటూ హితవు చెప్పాడు ఎస్. ఐ.

వేణు ఏమీ మాట్లాడలేదు. మనసులో మాత్రం 'ఈయన చెప్పిందే తెలియదు కాబోలు నాకు!' అనుకున్నాడు.

అందరూ వెళ్ళిపోడానికి లేచారు. శంకరంగారు వేణువైపు చూసి, 'వేణూ!...నువ్వు యీ ఎస్. ఐ. గారి ముందే సుబ్బారావును క్షమాపణ అడగాలి' అనేసరికి వేణు తెల్లబోయ్యాడు. అతడి మనసు ఎదురు తిరిగింది ఎందుకడగాలని...అయిష్టత వెలిబుచ్చుతూ శంకరంగారివైపు చూశాడు. అది గ్రహించిన శంకరంగారు. 'నా మాట మీద ఏమాత్రం గౌరవమున్నా నువ్వు అతణ్ణి క్షమాపణ అడగాలి తప్పదు వేణూ!' అన్నారు.

'నేనెందుకు క్షమాపణ అడగాలి మేష్టారూ?' అని అడుగుదామని నాలుక చివరిదాకా వచ్చింది. కానీ మేష్టారిని అవమానించినట్లు అవుతుందేమోనని తమాయించుకున్నాడు. 'ఎక్స్‌క్యూజ్ మి మిస్టర్ సుబ్బారావ్!' అని చాలా మెల్లిగా అనేసి వరండా బయటికి నడిచాడు.

శంకరంగారు అందరివద్దా సెలవుతీసుకొని వచ్చేసరికి వేణు గేటుదగ్గర తనకోసం కనిపెట్టుకున్న మిత్రమండలితో జరిగిందంతా చెబుతున్నాడు. 'అనవసరంగా శంకరం మేష్టారిని యిరికించారనిగాని...లేకుంటే ఎలా?...' స్నేహిత స్వారస్యంతో అంటున్నా

వేణు మేష్టారిని చూసి ఆగిపోయాడు.

'రావోయి వేణూ!...రా...ఇంటికి వెళ్దాం...' అని ఆయన పిల్చేసరికి, తప్పని సరిగా ఆయన్ను అనుసరించాల్సి వచ్చింది వేణుకు. అతడితోబాటు మిత్రబృందమూ కదిలింది వెనకాలే...ఇందరిమధ్యా పిల్లల కోడిలా వెళుతున్న శంకరంగారివైపు ఓసారి చూసి, రిక్షా చేసుకుని మరోదోవన యిల్లు చేరుకున్నారు సుబ్బులూ వరదరాజులుగారు.

శంకరంగారు వాళ్ళందరితో కలిసి యిల్లు చేరుకున్నారు. అక్కడ వాళ్ళందర్నీ కూర్చో పెట్టుకుని వేణుతో, 'వేణూ!...దౌర్జన్య మనేది ఒకరి మనసును మార్చడానికి ఏ మాత్రం వుపయోగపడదు. 'దౌర్జన్యం దౌర్జన్యాన్ని ప్రోత్సహిస్తుంది. కొట్టి తిట్టి ఒకరిని తాత్కాలికంగా మార్చవచ్చునేమో గాని మనిషిలో మార్పుతేగలమనుకోడంపొర బాటు...' అంటూ ఓ అరగంట సేపు చెప్పారు...

వాళ్ళకుమాత్రం ఆ హితోపదేశం మలే రియా మాత్రంత చేదుగా వుంది. వాళ్ళ పరిస్థితి గమనించి ఆయన, 'నేనిలా చెబుతున్నానంటే మీ మంచికోరే చెబుతున్నాను. మీ భవిష్యత్తు అంతా యిప్పుడు మీరు చదువును గురించి తీసుకునే శ్రద్ధమీదనే ఆధారపడివుంటుంది. మీరంతా చదువు కుంటున్నవాళ్ళు. ఇటువంటి కొట్లాటల్లోకి దిగితే చదువు పాడవుతుంది. పలుగురితో చెడ్డపేరూ వస్తుంది. పైగా పోలీసుల లిస్టులోకి పేరు ఎక్కిందంటే అది ముందు ముందు మీ భవిష్యత్తుకు ఎంత గొడ్డలి పెట్టో మీకు తెలియదు...అసలు ముఖ్యంగా వేణూ! నువ్వూ మీ స్నేహితులు, యికముందు యిటువంటి వాటిల్లో జోక్యం చేసుకోమని, ముఖ్యంగా ఆ సుబ్బారావు, వరదరాజులుగారి జోలికిపోమని నాకు మాటివ్వండి...' అంటూ వాళ్ళందరి దగ్గరా వాగ్దానం తీసుకున్నారు.

మర్నాడు సాయంత్రం మామూలుగా లైబ్రరీకి వెళ్ళే శంకరంగారు వేణును కూడా తనతోబాటు లైబ్రరీకి పిల్చుకు వెళ్ళారు...పనిపాటూ లేకుండా వున్నప్పుడే మెదడులో భయంకరమైన వూహలు పుడతాయి...అందుకే శంకరంగారు వేణుకు ఏదో వ్యాపకం కలిగించా లనుకున్నారు... సాయంత్రం క్రికెటు ఆటతో గడిచి పోతోంది...ఇక వుదయంవేళ...అప్పుడు లైబ్రరీకి వెళ్ళి నీకు తోచిన పుస్తకాలు చదువుకోమని సలహాయిచ్చారు...'నీకు కాలేజి తెరిచేదాకా తీరికేకదా...ఈ తీరిక సమయం గ్రంథపఠనానికి వుపయోగించు. ఇప్పుడు సంపాదించుకున్న యీ విజ్ఞానం విలువ యిప్పట్లో తెలియకపోవచ్చుగాని ముందుముందు నీకే తెలుస్తుంది...' అని చెప్పారు!

ఆ తర్వాత రోజూ తనకు తీరిక చిక్కినప్పుడల్లా లైబ్రరీలో వచ్చి కూర్చునే వాడు...సాహసకృత్యాలతో నిండిన 'టామ్ సాయర్', 'కాంచన ద్వీపం' 'గలివర్ ట్రావెల్స్' లాంటివి ఎక్కువగా చదివాడు వేణు. ఒకరోజు లైబ్రరీలో ఒక యువకుడితో పరిచయమైంది. అతను వేణు చదవదల్చుకున్న కాలేజీలోనే చదువుతున్నాడు. అతడితో పరిచయం వృద్ధి చేసుకున్నాడు వేణు...ఆ యువకుడు ఎక్కువగా రాజకీయాల్లో తిరిగేవాడు...అతడితో స్నేహం వేణుకు రాజకీయాలమీద ఆసక్తి కలిగించింది. అతడితో కలిసి పలుసభలకూ సమావేశాలకు వెళ్తుండేవాడు. రక్తాన్ని వుడుకెత్తించే ఆ భాష, ఉద్రేకపర్చే ఆ భావావేశం వేణును పూర్తిగా మార్చేసింది. ఆ సంస్థలో అతడూ సభ్యుడిగా చేరిపోయాడు!...

* * *

పందిట్లో సన్నాయి మధురంగా మ్రోగుతోంది...రామాలయంలో ప్రత్యేకంగా వేసిన వేదికమీద శ్రీ సీతారాముల కల్యాణ మహోత్సవం కన్నుల పండువుగా జరుగు



"ఇంక చీరచూపించక్కర్లేదుగాని బయటికి దారిచూపించండి బాబు!"

# పూర్వాసంధ్యా ప్రవర్తతే..

తోంది...ఆ రోజు రామనవమి...ఆ వూళ్ళో రామనవమి వుత్సవాలు బాగా జరుగుతయ్యని, చూచివద్దాం రమ్మని రమణయ్యగారి భార్య భద్రమ్మగారు, బలవంతంచేస్తే వాళ్ళతో కలిసి, వాళ్ళవూరికి మూడు మైళ్ళలోవున్న యీవూరికి వచ్చింది జ్యోతి.

అసలు జ్యోతికి తిరునాళ్ళకూ యిలాంటి వుత్సవాలకూ వెళ్ళడం యిష్టంలేదు. తమ యింట్లో దేముడిగదిలోని ప్రశాంత వాతావరణంలోనే, భగవంతునివిపాద మనసును లగ్నంచేయగలదు జ్యోతి ఆ త్రొక్కిసలాటలో కంటే...అయినా భద్రమ్మగారి మాట త్రోసెయ్యలేక వాళ్ళతో తప్పనిసరిగా వచ్చింది వాళ్ళబండిలోనే ఎక్కి.

మంటిట్లో వెనుకగా ఓమూల కూర్చుని సీతారాముల తలంబ్రాలు చూస్తున్న, జ్యోతి 'జ్యోతీ!...'అన్న పరిచితకంఠం విని, చుట్టూ చూసింది...భద్రమ్మగారు, లక్ష్మి, సరోజిని అంతా కూడా తిరిగి చూశారు.

చాటంత మొఖంతో కూర్చున్నవాళ్ళను దాటుకుంటూ దగ్గరకు వస్తున్న యువతిని చూచి, 'రవణా!...'అనుకుంటూ అమాంతం వెళ్ళి కౌగలించుకుంది జ్యోతి.

'హమ్మయ్య!...ఇందాకటి నుండీ చూస్తున్నాను నువు అవునో కాదో అని...' అంది అప్పటికి సందేహ నివృత్తి అయిన రవణ సంతోషంతో జ్యోతిని పట్టుకుని...

ఆ సంతోషంలో కాస్సేపు యిద్దరికీ మాటలు పెగల్లేదు ... ఒకళ్ళ నొకళ్ళ చెమర్చిన కళ్ళతో చూస్తూ నిలబడ్డారు... తర్వాత యిద్దరూ ఒక పక్కగా వెళ్ళి, కూర్చున్నారు...జ్యోతి రవణ చంకలో వున్న పాపను తీసుకుంటూ. 'ఈ పాప ఒక్కతేనా?...' అని అడిగింది...

'ఇది చంటిది ... ఇంకా ముగ్గురున్నారు... వాళ్ళను యింట్లో వదిలేసి వచ్చాను యిక్కడ, జనంలో నలిగిపోతారని...' అని చెప్పింది రవణ.

'ఈ వూరేనా మీది?'

'కాదు జ్యోతీ!... ఈ వూరికి మూడు మైళ్ళు మా వూరు ... బండికట్టించుకు వచ్చాను మా పక్కింటి వాళ్ళు వస్తుంటే...



ఘెరావో కాదండి పేపర్లో రిజల్ట్సువచ్చాయట.

అదిసరే... ఆ రమణయ్యగారి కుటుంబంతో నీకేం పరిచయం? వాళ్ళది మా వూరయితే?...'

'మాదీ ఆ వూరేను...అయితే నువ్వున్నదీ ఆ వూళ్ళోనే అన్నమాట! ... ఇద్దరం యిన్నాళ్ళుగా ఒక్కవూళ్ళో వుంటూ ఎన్నాళ్ళకు కల్సుకున్నామే రవణా! ... అసలు ఎన్నిసార్లు చూశానని నువు కన్పడతావని?...చివరికి 'యిప్పుడీ వూళ్ళో వుంటుం లేదేమో' అనుకున్నాను . అదిసరే... పెళ్ళికి రాలేదేం? శుభలేఖ పంపానుకదా?...' అని అడిగింది జ్యోతి ... రవణ పెళ్ళికి కూడా జ్యోతి వెళ్ళలేక పోయింది తండ్రికి చాలా జబ్బుగా వున్నందున... రవణ పెళ్ళయ్యాక రెండు మూడేళ్ళదాకా స్నేహితురాళ్ళ మధ్య వుత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వుండేవి...

'శుభలేఖ పంపావా?'అంది తెల్లబోతూ రవణ.

'ఆఁ... ఊరు అదేనని జ్ఞాపకం...అందుకని విజావాడ కేరాఫ్‌న పంపాను ... అయితే వీధిపేరు అదీ గుర్తులేదు కాని...ఏం అందలేదా?!' అని అడిగింది జ్యోతి ఆశ్చర్యపోతూ, అంది వుంటే రవణ కనీసం 'గ్రీటింగ్స్' అయినా పంపుండేది అన్న నమ్మకంతో...

రవణ ఆలోచిస్తోంది...ఊరిపేరు వ్రాసి తన భర్తపేరు వ్రాస్తే తప్పకుండా వుత్తరాలు అందుతూనే వున్నాయి'''మరి యిది ఎందుకందినట్టు?'...అనుకుని...

'మీరుండేది ఏవీధిలో? ఆయనేం చేస్తుంటారు?...' అని అడిగింది ఏదో ఆలోచిస్తూ.

'మా యిల్లు కూడా యీ రమణయ్యగారింటికి పక్క వీధే...ఆయన ఆ వూరి సర్పంచ్' అంది జ్యోతి.

రవణ మొఖం ఒక్కసారిగా వివర్ణమైంది... 'ఆనందరావు భార్యవా?!...' నీరసంగా అడిగింది రవణ... 'ఆనందరావు భార్య బి. ఎ. చదువుకుందని అన్నారు గాని నువ్వనుకోలేదు.' అని బరువుగా నిట్టూర్చింది రవణ...

'ఆయన తెలుసన్నమాట!...' రవణ ఎందుకింతగా నిరుత్సాహ పడుతున్నదో అర్థంకాని జ్యోతి రవణ మొఖంలోకి చూస్తూ

ఇంతకూ మీ శ్రీవారిని గురించి చెప్పనే లేదు...' అంది.

**రవణ ఒకసారి,** కళ్యాణం కూడా చూడకుండా, తమవైపు వింతగా విడ్డూరంగా చూస్తున్న భద్రమ్మగారివైపు చూసి తర్వాత జ్యోతివైపు తిరిగి 'ఏంచెప్పను జ్యోతీ!...మనిద్దరికీ ఎంత ప్రాణస్నేహమో మీవారికీ మావారికీ అంత వైరం!...మేమంతా ప్రతిపక్షంవాళ్ళమన్నమాట... మొన్న ఎన్నికల్లో మీవారిమీద పోటీచేసింది మా వారే...' అన్నది ... రవణ నవ్వాలని నవ్వుతున్నా మొఖంలో జీవం కన్పించలేదు. జ్యోతి పంపిన శుభలేఖ తనకు చేరకుండా చేసింది ఎవరో గ్రహించిన రవణ బరువుగా నిట్టూర్చింది.

జ్యోతికి పిడుగుపడ్డట్టయింది. ఒకటవ క్లాసునుండీ స్కూలు ఫైనలు దాకా ఒక్క ప్రాణంగా మెలిగిన స్నేహితురాళ్ళు వాళ్ళిద్దరూ...క్లాసులో యిద్దరూ ఒక్క బెంచీమీద కూర్చునేవాళ్ళు. ఇద్దరూ కవల పిల్లల్లా కలిసి తిరిగేవాళ్ళు. రవణ స్కూలు ఫైనలు చదువుతుండగా తండ్రిపోయాడు అంతటితో చదువు ఆపేసి వాళ్ళ సొంత వూరు వెళ్ళిపోయ్యారు రవణా వాళ్ళు. మరుపటి సంవత్సరమే రవణ పెళ్ళిచేశారు... కాని జ్యోతి పెళ్ళికి వెళ్ళలేకపోయింది తండ్రికి 'చాలా జబ్బుచెయ్యటంవల్ల...ఆ తర్వాత కూడా రవణ అప్పుడప్పుడూ జ్యోతికి ఉత్తరాలు వ్రాస్తూనే వుండేది. అత్తగారింట్లో వున్నప్పుడు వీల్లేక పుట్టింటి కొచ్చినప్పుడు ఎప్పుడైనా వ్రాస్తుండేది.

కలుసుకోక కలుసుకోక యిన్నాళ్ళకు ప్రాణస్నేహితులు కలుసుకుంటే మళ్ళీ యీ పట్టాలేమిటి? ... అందుకే గాబోలు రవణ పేరు చెప్పి యిల్లు తెలుసా అని అడిగితే తెలియదని భర్త తప్పుకున్నది!...సుశీలకూడా ముందు తెలుసని తర్వాత తెలియదని చెప్పింది!...జ్యోతి పెద్దగా నిట్టూర్చింది... కోరిన వస్తువుతెచ్చి ముందుపెట్టి ముట్టుకో వద్దన్నట్లుగా వుంది రవణకూ జ్యోతికీ ...మనసుల్లో ఇద్దరూ ఒక్క విషయం గురించే బాధపడుతున్నారు... ఇద్దరి మనసులకూ గుచ్చుకున్న ముల్లు ఒక్కటే!...'తమ భర్తల కక్షలు తమ స్నేహాన్ని చెడగొట్టడమా'అని...కాస్సేపటికి జ్యోతి అంది 'రవణా! వాళ్ళిద్దరికీ పడనంతమాత్రాన మన స్నేహం చెడిపోతుందా? ఇద్దరం ఒక్క ప్రాణంగా వుండేవాళ్ళం అంతలో విరోధులం అవుతామా?...' రవణ చేతిని పట్టుకుని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

'వాళ్ళ కక్షలు మన స్నేహాన్ని చెడగొట్టవని నువ్వంటే అంతకంటే ఏం కావాలి జ్యోతీ!'...అంది రవణ చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ...

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటుండగానే అక్కడ కళ్యాణం పూర్తయింది. అక్షింతలు ప్రసాదం తీసుకున్న భద్రమ్మగారూ వాళ్ళూవచ్చి 'ఇక వెళ్దాం రామ్మా...ఇప్పటికే ఒంటిగంటదాటినట్లుంది ' అని పిల్చారు...

'నువ్వు రావా రవణా?...'అని అడిగింది జ్యోతి.

'వెళ్దాంపద...అదుగో మా పక్కింటి వాళ్ళు కూడా వస్తున్నారు...మా బండిలో వస్తావా?...ఇద్దరం మాట్లాడుకుంటూ కూర్చోవచ్చు...' అని పిల్చింది రవణ.

'ఎందుకులేమ్మా...జ్యోతి...బండి సిద్ధంగా వుందికదా రా వెళ్ళిపోదాం' అంది మళ్ళీ భద్రమ్మగారు రవణవైపు కొరకొరా చూసి ఒకసారి...

జ్యోతికి ఏటూ తోచ లే దు...ఇటు భద్రమ్మగారు రమ్మని బలవంతం చేస్తుంది ...అటు రవణయ్యా చెయ్యిపుచ్చుకుని వదలటం లేదు ... ఏం చెయ్యాలి తను?... భద్రమ్మతోపాటు బండెక్కకపోతే ఆవిడేమన్నా అనుకుంటుందేమో వచ్చేటప్పుడు ఆవిడగా వెళ్ళి...పోనీ ఆ బండిలోనే వెళ్దామా అంటే మళ్ళీ రవణతో తిరిగా మాట్లాడే అవకాశం ఎప్పటికి?...ఇన్నాళ్ళకుగాను కల్సుకున్నారు...రవణతో ఎన్నో కబుర్లు చెప్పాలని వుంది తనకు...చివరికి 'ఊరు వచ్చేదాకా దాంతోబాటు ఆ బండిలో వస్తాను...అక్కడినుండి బండిలో మన వీధికి వెళ్ళొచ్చు...' అంది భద్రమ్మగారితో చాలా నొచ్చుకుంటూ...

'భద్రమ్మగారు యిబ్బందికరంగా మొఖం పెట్టింది...ఆవిడకు ఏమనడానికీ తోచలేదు...'సరేలే వూరి పొలిమేరల్లోకి రాగానే తను బండిలోకి వస్తానందికదా...ఇప్పుడు ఏం చెప్పినా లాభం వుండేట్టు లేదనుకొని మాట్లాడకుండా వెళ్ళిపోయింది... రవణా, జ్యోతి, యింక యిద్దరు ముగ్గురు యిరుగు పొరుగువాళ్ళు రవణా వాళ్ళ బండిలో ఎక్కారు...ఎద్దుమువ్వలు సవ్వడి చేసుకుంటూ సాగిపోతోంది...భద్రమ్మగారుకూడా ఆ బండి వెనకాలే పోనిమ్మని తను బండి వాణ్ణి హెచ్చరించింది....

(ఇంకా వుంది)






రైలు సికింద్రాబాదు స్టేషన్ చేరింది. రైల్లోంచి ప్లాట్‌ఫారంమీద అడుగువేసిన రాధిక, ఒకసారి అంతా కలయజూసింది ఆత్రంగా. కాని అనుకున్న వ్యక్తి అగుపించకపోయేసరికి పూర్తి ఆశాభంగం కలిగింది. కోపం కూడా వచ్చింది.

'ఏదేం మనిషి! రిసీవ్ చేసుకొందుకు వస్తానని వ్రాసి రాకపోవటానికి కారణం ఏమిటి? అసలే క్రొత్త వూరు. ఎలా యిప్పుడూ...' అనుకొని చేసేది లేక మరొకసారి అంతా కలయజూసి సూట్‌కేసు పోర్టర్ చేతికిచ్చి బైటకు నడిచింది. అడ్రసు కాగితం మరొక్కసారి చూసుకుని టాక్సీని కేకవేయబోయింది రాధిక.

ఇంతలో 'ఏమండీ! మీ పేరు రాధిక కదూ!' అంటూ వినిపించగా ప్రక్కకు చూసింది. ఆశ్చర్యంగా.

టెరిలిన్ ఫుల్‌సూట్‌లో ఒక యువకుడు కనుపించాడు. అతనికి సుమారు ఇరవై ఐదేండ్లు ఉంటాయి. కొంచెం చామన ఛాయ. వుంగరాలు తిరిగినున్నగా దువ్వబడిన క్రాపు. ఎవరో అనుకొంది మనసులో. ఎప్పుడూ చూసినట్లు గుర్తులేదు. ఇతనికి తన పేరెలా తెలుసు. ఒకవేళ బావ పంపలేదు కదా! తనకోపం.

'అవును...' అని మోహం కళ కళ్ళాడ చూసింది.

'నా పేరు శేఖర్. మీ బావ మధు నా స్నేహితుడు. ఆఫీసు పనివల్ల తను రాలేక, మిమ్మల్ని రిసీవ్ చేసుకొందుకు నన్ను పంపాడు. రండి నా కార్లో పోదాం...' అంటూ కారు డోర్ తెరిచాడు. మౌనంగా అతనిని అనుసరించి కారు వెనక సీట్లో కూర్చుంది. కారు ముందుకు దూసుకుపోయింది.

బావమీద భలే కోపం వచ్చింది రాధికకు. తను రాకపోతే కనీసం అక్కయ్యనన్నా పంపకూడదు. తన్ని రిసీవ్ చేసుకొందుకు ఎవరో స్నేహితుణ్ణి పంపుతాడా. ఏం — ఆమాత్రం తను రాలేదూ! తనకు సాధ్యంకాదా. ఎంత క్రొత్త వూరయినా, ఎంత పెద్ద పట్టణమైనా అడ్రసు ప్రకారం ఇంటిని కనుక్కోలేనంత చిన్నపిల్ల కాదుగా తను. మనస్సుకు కొంచెం బాధనిపించింది.

పోర్టికోలో కారాగిన చప్పుడు విని బయటకు వచ్చింది సరోజ. కారుదగ్గరకు నడిచి చెల్లిల్ని కౌగలించుకొంది. 'ఎన్నాళ్ళకు చూశానే నిన్ను' అంది. అక్క చేతిని మృదువుగా నొక్కి నవ్వింది రాధిక.

'నేను వెళ్తాను! వదినా! సాయంత్రం అగుపిస్తా...' అంటూ కారు తలుపు తీశాడు శేఖర్.

'కాఫీ తీసుకొని పోదువుగాని వుండు శేఖర్' అంది సరోజ.

'వద్దులే వదినా! సాయంత్రం వస్తాగా...' అంటూ కారు స్టార్టు చేసి వెళ్ళిపోయాడు శేఖర్. ఒకసారి రాధికవంక వోరగా చూసి.

వెళ్తున్న కారువంక ఒకసారి తిలకించి అక్కతో లోనికి అడుగులువేసింది రాధిక.

'ప్రయాణం బాగా జరిగిందా...' అంది సరోజ.

'ఆ...'

'అమ్మా — నాన్నా కులాసాగా వున్నారా?'

'ఊఁ!...'

'పరీక్షలు బాగా వ్రాశావా?'

'ఆఁ...'

'ఏమిటే — ఆ — ఊఁలు! ఎందుకంత పరధ్యానం...'

'బావ రాకపోతే కనీసం నీవన్నా స్టేషనుకి రాకూడదా...'

'ఓహో! అందుకా ఇంత పరధ్యానం-మరే

మిటో అనుకున్నా. అయినాయిప్పుడేమయింది బావ వద్దామనుకునే ప్రయాణ మయ్యారు. కాని ఆఫీసు వ్యూనువచ్చి వాళ్ళఆఫీసరు తొందరగా రమ్మన్నాడని చెప్పాను. ఇంకేం చేస్తారు. శేఖర్‌కు ఫోనుచేసి నిన్ను రిసీవుచేసుకొమ్మని చెప్పాడు. ఇక నేనంటావా, నాకు ఒంట్లో కొంచెం బాగాలేదు. నాలుగు రోజులనుండి జ్వరం. తగ్గిందనుకో. అయినా నీరసంగానే వుంది యింకా. అందుకనే శేఖర్‌ని పంపాల్సి వచ్చింది. అతను పరాయివాడేం కాదు. మనవాడే. మీబావకు ప్రాణస్నేహితుడు. చుట్టరికం గూడా వుందిలే' అంది తలెగరేస్తూ...

'అయినా ఎవరో నాకు ముక్కూ—మొహం ఎరగని క్రొత్త వ్యక్తిని పంపట మేమిటి? ఎంత బాధపడ్డానో—తెలుసా?'

'ఎందుకు—అతను నిన్నేం ఎత్తుకు పోలేదుగా...'

'ఇంకా నయం—ఫరవాలేదు అసలా...'

'ఎత్తుకుపోయినా వరుసయినవాడేగా...' అంది నవ్వుతూ సరోజ. ఎందుకో సంభాషణ ఎబ్బెట్టుగా తోచింది రాధికకు. మరొక ప్రసంగమేం చేయకుండా స్నానాల గదివేపు నడిచింది. స్నానం ముగించి డ్రెస్ చేసుకొని వచ్చేసరికి మధుమూర్తి వచ్చాడు. నవ్వుతూ 'ఏం రాధీ! బాగున్నావా?'

'బాగానే వున్నాను బావా!' అంది మాటిగా మధుమూర్తి వంక చూస్తూ.

'స్టేషనుకు రాలేదని కోపమయితే రాలేదు గదా...'

'ఎందుకుబావా కోపం. నాకేంరాలేదు...'

'అంతా అబద్ధమంటే వీరు రాలేదని ఎన్నిసార్లు అనుకుందో. మీరు రాకపోతే నేనన్నా రాకూడదా—శేఖర్ని ఎందుకు పంపారు అంది. నేను సమాధాన పరచాననుకోండి...'

'అర్జంటుపనివల్ల వెంటనే వెళ్ళాల్సి వచ్చింది. అందుకనే శేఖర్ని పంపాను. మరేమనుకోకు...ఇంతకీ పరీక్షలెలా వ్రాసావు...' అనడిగాడు.

'బాగానే వ్రాసాను—బావా!'

'ఏ క్లాసు...'

'మొదటిది రావచ్చు'...

'తరువాత...'

'మెడిసన్ చదవా లనుకొంటున్నాను.'

'ఇదేమిటే యింతకుముందు చదవనన్నావుగా?' అంది చెల్లెలివంక ఆశ్చర్యంగా చూస్తూ.

'ఎందుకోయిప్పుడు చదవాలని పిస్తోంది...'

'పి.యు.సి. పాసయినపుడే చేరాల్సింది. మేమంతా చెపుతున్నా విన్నావుకావు, అప్పుడే చేరినట్లయితే హాయిగా యీపాటికి నాలుగవ సంవత్సరంలో వుండేదానివి. అనవసరంగా మూడుసంవత్సరాలు వృధాచేశావు...'

'అప్పట్లో ఎందుకో చదవాలనిపించలేదు. కాని యీ మధ్య చదవాలన్న వుత్సాహం కలిగింది. బహుశా నాకు సీటుదొరకవచ్చు...'

'నాన్నగా రేమంటారో, అమ్మ వొప్పుకొంటుందో లేదో—అసలే చదువు విషయంలో గొడవ జాస్తి...'

'మీవాళ్ళ గురించి బెంగపడకు - రాధ! నే చెప్తాలే' అన్నాడు మధు రాధికవేపు చూస్తూ.

'అబ్బో! మాయింట్లో మీకు పెద్ద పోర్స్ వున్నట్లు భరోసా యిస్తున్నారు. అమ్మ సంగతి మీకు తెలీదు. దీని



కుండున్న తన అభిలాషను మెచ్చుకుంటూ, టేబిల్ పై చివరి వాక్యాలలో నున్న ఒక కథను చూశాడు...దాన్ని తీసి తన వంక చూసి చదివాడు. ఒక అరగంట వరకు ఆ గదిలో తామిద్దరం వున్న సంగతి మరిచి పోయాడు. చదవటం పూర్తిచేసి తనవంక తిరిగిన మధుమూర్తి ముఖం బాధతో నిలుముకున్నట్లు తన కనిపించింది.

'ఈ కథ మీరు వ్రాసిందేనా?'

'అవును...'

'మీకు ట్రాజెడీలు అంటే యిష్టమా?...'

'అలా వ్రాయటం నా అభిరుచి...'

'ఇంతవరకు సుఖాంతాలు వ్రాయలేదా?'

'లేదు....'

'ఎందుకు మీకు దుఃఖాంతాలంటే యింత యిష్టం—అభిమానం...'

'ఏం మీకు నచ్చవా...'

'దుఃఖం అంటేనే నేను భరించలేను. అలా వుండటం, చూడటం నేను సహించలేను. నాకు యిష్టముండదు.'

'అయితే యిద్దరు బాగా కలిసిపోయారు.' అర్థంకానట్టు చూశాడు.

'మా అక్కయ్యకూ నచ్చవులెండి...' నవ్వాడు.

'ట్రాజెడీ అంటే మీ అభిప్రాయం?' యిదేం ప్రశ్న! అన్నడిగాడేమిటి. ఏ విధమైన అభిప్రాయంతోనో తనలా వ్రాస్తుంది.

'గుండె కరిగించి, పాఠకుల మనస్సులను హత్తుకుపోయి, బాధ కలిగి, పాత్రలపైన జాలి — సానుభూతి కలిగించేవే ట్రాజెడీలు...'

'అలా వ్రాసినందువల్ల మీకేవిధమైన ఆనందం కలుగుతుందా?'

'ఆనందం అనే మాటకు తావేలేదు. అలా వ్రాయటం నా అభిరుచని చెప్పాగా...'

'అయితే మీకు హృదయం లేదన్న మాట...' ఆశ్చర్యంతో మధుమూర్తి వంక చూసింది రాధిక.

'అందరూ బాధలతో జీవిస్తుంటే, సమస్యా వలయాల్లో చిక్కుకుంటే, కష్టాలు పడుతుంటే మీరు ఆనందిస్తున్నమాట, అంటేనా మీ అభిరుచిలోని వుద్దేశ్యం...'

'అలా అని ఎందుకనుకోవాలి...'

'కాక మీరు పాఠకులకు అందిస్తున్న విషయం ఏమిటి? మీ కథల్లో అన్నీ జీవితాలు దుఃఖమయమని చిత్రిస్తు లేకుండా చెప్తున్నారు. అంటే మీరు పాఠకుల మనస్సులను దుఃఖమయం చేస్తున్నారు.'

'కాదు. నా అభిమతం అది కానేకాదు. మన నిత్యజీవితంలో జరుగుతున్నవే నేను వ్రాస్తున్నాను. వాస్తవికతను వర్ణించిన విస్తారాకులా పాఠకుల ముందుంచటమే నా అభిమతం...ఆశయం కూడాను.'

'కానీ మీరు వ్రాయవలసిం దేముంది. అందరికీ తెలియవూ... కనీసం వూహించలేరా—ఆమాత్రం కష్టాలూ, బాధలూ, సమస్యలూ— ఎత్తిచూపించటం అవసరమే. కానీ అందరూ సుఖాన్నే కోరుకుంటారు గాని, కథల్లోలా దుఃఖాన్ని కాంక్షించరుగా. అనుక్షణం సుఖశాంతులు కావాలనుకుంటున్నవారికి మీ కథలు చదవాల్సిన అవసర ముండదు. అయినా కథ అంటే ఏమిటి. పాఠకుల నిత్యజీవితాలకు మీ కథ ఎంతవరకు ఉపయోగపడుతుంది—అన్న ఆలోచన మీకు రాదా! విచారించాల్సినంత అవసరం లేదా? కాలక్షేపంకోసం కథలు చదువుతారా ఎవరైనా? మీ కథవల్ల ప్రతి వారికీ ఉపయోగం లేకపోయినా కనీసం ఏ ఒక్కరికైనా ఉపయోగపడేదిలా ఉండాలి. అంటే మీ కథ, సమస్యలకు పరిష్కారాలుగానూ, బాధలను పోగొట్టేట్లుగానీ, సుఖాన్ని కలుగజేసేదిగానూ, అభిప్రాయాలకు అందేట్లుగానూ మానవత్వంతో ఒక మానవునిగా ప్రవర్తించేలా చేసేదిగానూ వుండాలి. అయితే మీ దుఃఖాంతాలవల్ల యివేవి ఎవరికీ లభ్యంకావు. మీ శ్రమ నిరుపయోగమేగా. ...

అందరు సుఖాన్నితప్ప, దుఃఖం కోరుకోరు. మీ కథలలో కష్టాలు, బాధలు, సమస్యలూ తప్ప—సుఖం, ఆనందం, శాంతి లభించవు. కష్టాలు అందరికీ వస్తాయి. బలహీనత అందరిలోనూ వుంటుంది. కష్టాల నెదుర్కొనే మనస్థయిర్యం అందరిలోనూ లేకపోవచ్చు...కానీ మీరు మీ కథలచే వాటిని కలుగజేయవచ్చు...అంటే కష్టాల నెదుర్కొనే మనస్థైర్యం, బలహీనతను పోగొట్టుకొనే మార్గం, నిశ్చల మనస్తత్వం. సుఖ — శాంతులతో తమ జీవితాలను ఎలా రూపొందించుకోవాలో చూపిస్తూ, మీ కథలలోని పాత్రలను నడిపిస్తే అవి ఎంత మందికి ఉపయోగిస్తాయో మీరు ఆలోచించలేదా?'

ఒక ప్రవాహంలా మాట్లాడాను మధూ. మొదటిసారిగా ఓటమిని అంగీకరించింది— రాధిక.

తరువాత ఒక నెలలో అక్కయ్య వివాహం మధుమూర్తితో జరిగింది...

ఆలోచనల్లోంచి వాస్తవికతలోకి వచ్చిన రాధిక, ఏదో స్ఫురణకు రాగా ఆత్రంగా తన సూట్‌కేసులో అతిభద్రంగా అన్నిటి కంటే అడుగున దాచిన చిన్నసైజు ఫోటో ఒకటి తీసి క్షణంసేపు దానివైపు వీక్షించింది... అంతవరకూ ఆమెలో మందంగా వెలుగుతున్నట్లున్న జ్యోతి — ఆ ఫోటోలోని మూర్తి వీక్షణాలవల్ల అత్యంత కాంతివంతంగా ప్రకాశించటం ప్రారంభించింది...



# నిన్నే ప్రేమించా...

**నాతో నిన్నే బావా**

ప్రియమైన మధూ!

"పేరుతో సంబోధిస్తూ వ్రాస్తున్నానని కోపగించుకోకు బావా! అలా...మ...ధూ... అని నోరారా పిలవాలని. అలా సంబో ధిస్తూనే వుత్తరాలు వ్రాయాలని, ఎన్నో సార్లు అనుకొన్నాను. ఎన్నో కలలుకన్నాను. కానీ, వ్రాయలేక పోయాను. అది నా చుట్టూ వున్న సంఘాన్ని చూసేగాని మరే భయం వల్లాకాదు. కానీ, ఒకసారి మటుకు ఎంతో ధైర్యంతో వ్రాస్తున్నాను...క్షమించు.

అసలీ వుత్తరం ఎలా వ్రాయాలా, ఎలా పూర్తిచేయాలాని మధ్యాహ్నం నుండీ ఆలోచిస్తూనే వున్నాను. చివరకు ఎలాగయితేనేం నా జీవితంలోని ఆఖరు వుత్తరం. నిన్నా పేరుతో పిలుచుకొని ఆనందిస్తూ యింతవరకుకన్న కలలను ఒకా వుత్తరం ద్వారా తీర్చుకొంటూ, నాలో యింతకాలం అణిగి-మణిగివున్న భావాల్నీ, ఆవేదననూ, నాలో పొంగిపొరలుతున్న ప్రేమానురాగాలన్నీ వ్రాస్తున్నాను. ఈ వుత్తరం నీ చేతిక్కడనే చదవాలి, చదివిన తరువాత నామరూపాలు లేకుండాచేయి. యిది నా చివరి కోరిక.

ప్రేమను గూర్చి కథలలో చదవడం, నా కథలలో వ్రాసుకోవటం తప్ప నా నిత్య జీవితంలో సంవత్సరం క్రితం వరకూ ప్రేమను పొందలేదు. అనుభవించలేదు— సంవత్సరం క్రితంవరకూ.

రచయిత్రిగా నా కథలలో ప్రేమను గూర్చి వ్రాస్తుండేదానిని. అయితే నా కథలన్నీ దుఃఖాంతాలే. ఏదో అభిరుచిగా పెట్టుకొని వ్రాసేదాన్ని తప్ప ఎప్పుడూ మాటేగా ఆలోచించలేదు. నేను వ్రాసే సంఘటనలే ఎప్పుడైనా నా జీవితంలోకూడా వస్తేనేనా సమయంలో ఎలాటి పరిస్థితిలో వుంటాను! నా మనోస్థితి ఎలా వుంటుంది! నా అంతరంగిక సంఘర్షణ ఎలా వుంటుంది! నా ఆశయాలు— భావాలూ ఎలాంటి చిక్కుల్లో యిరుక్కుంటాయి, నేను వెదకబోయే సత్యమేమిటి అసలు నా జీవితం ఏ రకంగా రూపొందుతుంది—అని కనీసం ఏ ఒక్కసారైనా వెనుదిరిగి ఆలోచించుకోలేదు.

అక్కయ్య వ్రాయవద్దని ఎంతపోరినా విని పించుకోలేదు.

మా యింటికి పెళ్ళిచూపులకి వొచ్చి నపుడు నాకు హృదయం లేదన్నావు గుర్తుందా! నిజంగా నా హృదయం ఆక్షణంవరకూ చలనరహితంగానే వుంది, ఎలాంటి స్పందనలూలేవు. నువ్వన్నట్లు హృదయం లేకుండానే అప్పట్లో అలా ట్రాజెడీలు వ్రాయగలిగాను, కానీ తరువాత వ్రాయలేకపోయాను.

నీ ప్రేమను కథావస్తువుగా తీసుకొని నా కథలలో ఎన్ని పాత్రలను దుఃఖమయంచేశానో—నేనే ఒక సంవత్సరం నుండీ ఆ ప్రేమలోనే కరిగిపోయాను. పైకి చెప్పుకోవటానికి వలనుకాక లోన దాచుకో సాధ్యంకాక నాలో నేను యింత కాలం కుమిలిపోయాను. పతనమయ్యాను కానీ, ఒకనాడు వ్రాయగలుగు తున్నాను.

నేనూ ప్రేమించాను—బావా. ప్రేమిం చాను!

ఎవరినోకాదు?

నిన్నే!...

నిన్నే బావా— నేను ప్రేమించింది!!

నిన్నే—ప్రేమించా!!!

నిన్నే...

ఆశ్చర్యంతో శిలాప్రతిమయ్యాడు మధు మూర్తి. కలో, నిజమో అర్థంకాలేదు. నమ్మశక్యం కాలేదు. కొన్ని క్షణాల వరకు తేరుకోలేక పోయాడు.

'ఆశ్చర్యపోతున్నావు — కదూ — బావా! నమ్మలేవేమో కూడా. నువ్వేమిటి యీ విశాల విశ్వంలో కనీసం ఒక్కరైనా నమ్మరు. విని ఆశ్చర్యపోనివారు కూడా అగుపించరు. ఎలా నమ్ముతారు...నా పిచ్చిగాని! వివాహితుడైన వ్యక్తిని ఏ ఆడది ప్రేమిస్తుంది? నువ్వు కను చూద్దామన్నా కనుపించదు. కానీ... నేను ప్రేమించాను. వివాహితుడైన వ్యక్తినే ప్రేమించాను. అందునా నా స్వంత బావనే ప్రేమించాను. రక్తం పంచుకు పుట్టిన అక్కయ్య, నన్ను ప్రాణప్రదంగా ప్రేమించే అక్కయ్య భర్తనే ప్రేమించాను.

**అయితే నిన్ను నేను వాళ్ళించుకోవచ్చునా నీవూ నాప్పుకోలేకపోవచ్చు. అక్కయ్య అసలే** అంగీకరించదు. భర్త తన సర్వస్వం అయి వుండాలని కోరుకొంటుంది గాని మరొకరు ప్రేమిస్తే, ఆ హృదయంలో మరొకరు చోటు చేసుకోవాలని ప్రయత్నిస్తే ఏ స్త్రీ వొప్పుకుంటుంది. నేనూ వొప్పుకోలే నేమో. కాని ప్రేమించటం ప్రకృతి ధర్మం. ఎంతవద్దనుకొన్నా ఏదో ఒకనాడు సంభవించకపోదు. చుట్టూ వలయం గీసి అందులో యిముడ్చుకోలేపోదు. ఏ క్షణాన నిన్ను మా యింట్లో చూశానో, నీతో మాట్లాడానో, ఆ క్షణం నుండీ నిన్ను ప్రేమించాను. నిన్ను గుర్తుకు తెచ్చుకోని క్షణమంటూ, నీ తలపులేని రోజంటూ లేదు. రోజులో చాలా భాగం నీ ఫోటో చూస్తూ గడిపేదాన్ని. వీక్షణలోని క్రొత్త ఆనందాన్ని చవి చూస్తూ వుండేదాన్ని. ఫోటోలోని నీ మూర్తిని చూసి, దృష్టిలో పెట్టుకొని ఎప్పుడూ ఏదో వూహిస్తూ కలలుకంటూ వుండేదాన్ని, అప్పట్లో అదే నా బ్రతుకయింది.

మరినా, నీ ఫోటో నాకెలా లభ్యమయిందో చెప్పలేదు. నువ్వు వివాహమయిన తరువాత మూడు నిద్రలకొచ్చినప్పుడు నీ జేబులో నుండి తస్కరించాను. యిప్పుడు దీనితో జతచేస్తున్నాను...'

క్రింద పొరవేసిన కవరులో నుండి తన ఫోటో తీసి వెనక్కి త్రిప్పాడు.

'బావ — నా ఆరాధ్య దైవం. జీవన జ్యోతి—రాధిక' అని వుంది.

మళ్ళీ వుత్తర పఠనంలో మునిగి పోయాడు మధు.

'అసలు నీ వివాహం అక్కయ్యతో కాకూడదని భగవంతుణ్ణి ప్రార్థించాను. పెళ్ళిళ్ళు స్వర్గలోకంలో అవుతాయని అన్నట్లు నేనేం చేయగలను. నాకేం శక్తి వుంది. ఎలా ఆపగలను — ఎంత ప్రార్థించినా. ఎంతగా కోరుకున్నా — అందుకే ఏదీ ఆగలేదు. అక్కయ్యతో నీ వివాహం జరిగి పోయింది. నా దురదృష్టానికి నేను బాధ పడ్డాను గానీ నాలో ఒకమాయ క్రోధానికు తావు చేసుకోలేదు. లోకం దృష్టిలో నీవు అక్కయ్యను పెళ్ళాడావు, కాని నా అంత

అమూల్ నుంచి క్రొత్త పదార్థము!

# అమూల్‌స్ప్రే

ప్రోటీన్లు అధికంగాగల బేబీ ఫుడ్




ఏ ఇతర పాల ఆహారంలోను
శరీర నిర్మాణ ప్రోటీన్లు
ఇంతకు మించి లేవు!





**20 సెకండ్ల లోపుగా కరుగుతుంది... సులభంగా జీర్ణమవుతుంది!**

బిడ్డ తన మొదటి రెండేళ్లలోను బరువును నాలుగు రెట్లు అధికం చేసుకుంటూ త్వరగా పెరగాలి. ఇందుకు ఆధారమైన ప్రోటీన్ అమూల్‌స్ప్రే నుండి లభిస్తుంది. దీనిలో విటమిన్‌లు, ఇతర మంచి పదార్థములు కూడ వున్నాయి.

అమూల్‌స్ప్రేలో విటమిన్‌లు వున్నాయి. కార్బొహైడ్రేట్స్, క్రొవ్వు పదార్థములు, లోహపదార్థములు తదితర పోషకత్వపు పదార్థములు కూడ సరియైన మిశ్రమముగా వున్నాయి. నియాసిన్, పొటాషియమ్ అయొడైడ్, ఫోలిక్ యాసిడ్ సహజ స్థితిలో వున్నాయి.

**సులభంగా జీర్ణమవుతుంది**

అమూల్‌స్ప్రే, యూరప్, యు.ఎస్.ఏ.లలో చేసే ఉన్నతమైన 'స్ప్రేడ్రైయింగ్' పద్ధతి ప్రకారం చెయ్యబడుటచే బాగా జీర్ణమగుటయే గాక పాలలోని ప్రోటీన్ యొక్క విశిష్టత, ఉత్తమత్వము ఉన్నతస్థితిలో వుంచబడతాయి.

**అద్భుతంగా కరుగుతుంది**

పేస్టు చెయ్యనవసరం లేదు. కావలసిన వేడి నీటిలో అమూల్‌స్ప్రేను బాగా కలపండి. 20 సెకండ్ల లోపుగా మీ బిడ్డకు పాలు తయారవతాయి! పాలపీక అడ్డుకు పోదు.

**మీ బిడ్డకి తగినది అమూల్‌స్ప్రే**



అమూల్‌స్ప్రే మీకు
500 గ్రాముల డబ్బాలు
(1 పౌనుకు పైగా
48 గ్రాములు)లో లభిస్తుంది

ASPIAS-1/67-TL-R

ఏకైక డిస్ట్రిబ్యూటర్‌లు: వాల్టాస్ లిమిటెడ్

కైరా డిస్ట్రిక్ట్ కోపరేటివ్ మిల్క్ ప్రొడ్యూసర్స్ యూనియన్ లిమిటెడ్ ఆనంద్‌చే తయారు చెయ్యబడినది
మద్రాస్, కేరళ, ఆంధ్ర స్టేట్‌లలో పంపిణీ చెయ్యబడుతోంది.

# చిత్రలహరి

విశాల్ కంబయిన్స్‌వారి 'అగ్గిదొర'ను వాహినీ స్టూడియోలో ముహూర్తం అయిపోయింది. పూర్వాపేక్షరుస్సు కామరాజుగారు కెమెరా స్విచాన్ చేశారు ఇక అగ్గిదొర జానపదంనుంచి జనపథానికి రావడమే తరువాయి.

మొదటిరోజు షూటింగులో కాంతారావు, భారతి, విజయలలిత, ఛాయాదేవి, ధూళిపాళ, రాజారెడ్డి, ఎ. యల్. నారాయణ పాల్గొన్నారు సత్యనారాయణ, బాలక్రిష్ణ, రాజబాబు, గణేశ్, పవిత్రాదేవి, పద్మాంజలి మొదలైనవారు తతిమాపాత్రల్ని నిర్వహిస్తారు.

చాలాకాలంనుంచి విఠలాచార్యగారికి అసోసియేట్‌గా పనిచేస్తున్న బి వి శ్రీనివాస్ దీనికి దర్శకుడు, సంభాషణలు జి కృష్ణమూర్తి, సంగీతం విజయ కృష్ణమూర్తి కూర్చుతున్నారు.

—పీకరాజు ●

'ఎందున్నావో ఓ ప్రియా, అందుకో నా కౌగిలి' అని పాడుకుంటూ వచ్చింది ఛాయాదేవి. 'మీకూ, ధూళిపాళకీ డ్యూయెట్ పెట్టనా?' అడిగారు విఠలాచార్య ఆమె వేపు చూస్తూ. 'అయ్యబాబోయ్, వొద్దు సార్!' అన్నాను. విఠలాచార్య నవ్వి, 'ఏమిసార్ అలా అంటారు. ఆ వయసులో ఎంత ప్రేమ వుంటుందనీ!' అన్నారు నాకంత వయసులేదు గనుక — ఆయన చెప్పింది నిజం కావచ్చు. ఇంతకీ డ్యూయెట్ ఆ వయసులో వాళ్ళకి పెట్టడం లేదు గాని, ఊరికే తమాషాకి అన్నారాయన ఏవేళా, చెప్పలేం! ఆయన విఠలాచార్య గనుక, సమర్థులు గనుక డ్యూయట్ పెట్టేసినా ఆశ్చర్య పడఖర్లేదు.

ఇంతలో విజయలలిత మేము వున్న చోటుకి వచ్చి తనూ ఓ కుర్చీలో కూచున్నది. ఆ అమ్మాయిని చూస్తూ 'వెనక కాళియన్ రత్నం దెయ్యం పట్టినట్లు తలూపుతూ చేసే నాట్యం యిప్పుడు షేక్ డాన్సట ఏమిటీ?' అని అడిగింది ఛాయాదేవి విజయలలిత నవ్వుతూ తల, వొళ్ళు 'షేక్' చేసింది 'అవును ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏముందీ?' అన్నారు విఠలాచార్య. 'అయ్యోరామ! వెనకటివన్నీ మళ్లీ యిప్పుడు కొత్త ఫాషన్ కింద మారి వస్తున్నాయన్నమాట!' అంటూ ఆశ్చర్యపడిపోయింది ఛాయాదేవి.

ఈ సందడి శ్రీ విశాల్ కంబైన్స్‌వారు నిర్మిస్తున్న 'అగ్గిదొర' చిత్రం సెట్స్ మీదది.

ఈ చిత్రానికి రికార్డుచేసిన మొత్తం ఏడు పాటల్లోను రెండింటిని — యువరాణి మందిరంలో నాయకీనాయకులు భారతి, కాంతారావులపై చిత్రీకరణ జరిపారు. వాటిలో వొకటి సి నారాయణరెడ్డి రచన 'ఎందున్నావో ఓ చెలి— అందుకో నా కౌగిలి, నిలువలేను నిముషమైనా నీవు లేనిదే' అనేది. మరొకటి జి కృష్ణమూర్తి రచన 'పిలిచిన పలికేవు స్వామీ, శిలగా నిలిచేవేమీ' అనేది. ఈ రెండు యుగళ గీతాలనూ ఘంటసాల, సుశీల పాడారు 'ఒకరిని పాడు చెయ్యాలనుకునేవారు తామే చెడిపోతారన్న' ప్రాతిపదిక మీద యీ చిత్రం తయారు చేయబడుతున్నదని విఠలాచార్య చెప్పారు.



'లక్ష్మీనివాసం'లో రామ్మోహన్, భారతి.



'పూలరంగడు'లో జమున, చలం

* *

సుశీల పాడిన వొకపాట — విజయవర్ధన్ మూవీస్‌వారి 'ఉపాయంలో అపాయం' చిత్రానికిగాను యిటీవల వాహినీలోని రెండవ ఫ్లోర్‌లో జమున, బేబీ రాధిక, మరి కొందరు పిల్లలమీద చిత్రీకరించారు. ఈ చిత్రీకరణలో జమున పేరు వినిపించలేదు.

మరి జమునె ఎక్కడ వుంది? అని కొందరికి సందేహం రావచ్చును. ఆమె యిందులో అతిథి నటిగా పాల్గొంటున్నది. జమునతో పాటు యీ పాటలో నటిస్తున్న పిల్లలు అంతా 3,4 ఏళ్లవాళ్లు వాళ్లలో బేబీ రాధిక మరీ చిన్నపిల్ల. నిర్మాతలలో ఒకరైన పి. వెంకురెడ్డిగారి అమ్మాయి చిన్న పిల్లల్ని కెమెరా ముందు నించోబెట్టి షాట్ తియ్యాలంటే అంత సులభం కాదు అందులోనూ పాటలో ఇందుకు దర్శకునికి ఎంతో సహనం, ఉత్సాహం, ముఖ్యంగా పసివాళ్ల మనస్తత్వాల నెరిగి ఉండటం అవసరం. డైరెక్టర్ కృష్ణలో యివన్నీ పుష్కలంగా ఉండటంచేత రాధికను మూడ్‌లో పెట్టి తనకు కావలసిన మూవ్‌మెంట్సు చేయించుకున్నారు, పుట్టినరోజు పాట అది 'ప్రతి పాప దేవుని రూపే, ప్రతి నవ్వు తేనియ తీపే — అందరినీ నువు నవ్వించే రోజు, దేవుని దీవెన ఫలించురోజు' అనేది. ఆత్రేయ రచనకు సుశీల స్వరం మాధుర్యం చిలికితే, మహదేవన్ సంగీతం సుధలు చిందుతుందని వేరుగా రాయాలా?

*　　　*　　　*

బెర్లిన్‌లో జరుగనున్న 17 వ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో పాల్గొనటానికీ, తమదేశం చూడటానికీ శ్రీ జగ్గయ్యను పశ్చిమజర్మనీ ప్రభుత్వం ప్రత్యేకంగా ఆహ్వానించింది ఆయన జూన్ 21 ఉదయం మద్రాసునుంచి ఢిల్లీమీదుగా వెళ్లారు అంతకు ముందురోజు సాయంత్రం 7 గం. లకి ప్రముఖ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కూడా శ్రీ జగ్గయ్యకి హోటల్ అశోకాలో అభినందనసభ ఏర్పాటుచేసి తేనీటి విందు యిచ్చారు 'అంతస్తులు' చిత్రంతో ఆస్ట్రేలియావెళ్లిన నాగేశ్వరరావు జూన్ 14 న తిరిగి వచ్చారు.

*　　　*　　　*

ఆరుగంటలకు ప్రారంభం కావలసిన సభ ఏడుగంటలకు ఆరంభమయింది. 'జగ్గయ్య అలవాటు ప్రకారం ఆలస్యంగా వచ్చారు. ఇక్కడ అలాంటివి జరిగినా ఫరవాలేదుగాని, ఆయన రేపు విదేశాలకి వెళుతున్నారు గనుక అక్కడ పంక్చుయాలిటీ మెయింటెయిన్ చెయ్యాల'ని ఛలోక్తి విసిరి నాగేశ్వరరావు 'నా సహనటుడు, మిత్రుడు శ్రీ జగ్గయ్యకు యిలాంటి ఆహ్వానం, అవకాశం రావటం



సిడ్నీ మధ్యభాగంలోని డబుల్ బీ వద్ద మిస్ కారల్ ఉడ్, ఆమె స్నేహితురాలితో నాగేశ్వరరావు

నిజంగా నాకెంతో గర్వకారణం' అన్నారు. శ్రీయుతులు నాగయ్య, సుందర్‌లాల్ నహతా, ఎ ఎల్ శ్రీనివాసన్ జగ్గయ్యకీ అవకాశం రావడంపట్ల తమ హర్షాన్ని వెల్లడి లను తెలియబరిచారు గుమ్మడి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ 'తనకు తెలిసినంతవరకూ యిలాంటి అవకాశం రావటం యిది నాలుగవది అనీ — మొదట యస్ ఎస్. కృష్ణన్, తర్వాత శివాజీ గణేశన్, ఆ తర్వాత నాగేశ్వరరావుగారూ యిలా ప్రభుత్వ ఆహ్వానాలపై వెళ్లటం జరిగిందనీ— ఇప్పుడు శ్రీ జగ్గయ్యకీ ఆవిధమైన అవకాశం రావటం ఫిలిం పరిశ్రమకుచెందిన వారందరికీ గర్వకారణమని' చెప్పారు గుమ్మడి తమ ఉపన్యాసంలో జగ్గయ్యగురించి ఓ కొత్త విషయం చెప్పారు. అది జగ్గయ్యకు జ్యోతిశ్శాస్త్రంలో కూడా నైపుణ్యం ఉన్నదనేది ఇటీవల జరిగిన తమ కుమార్తె వివాహానికి జగ్గయ్య ముహూర్తం పెట్టారని తెలిపారు ఆయన. డా పి నారాయణరెడ్డి అనగనగా 'అనగా అనగా ఒక గంధర్వుడు' పేరిట గేయం చదివారు, జగ్గయ్య గుణగణాల్ని కొనియాడుతూ. జగ్గయ్య కృతజ్ఞత చెప్పారు.

*　　　*　　　*

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్‌వారు తమ 'ఆడపడుచు' చిత్రాన్ని జూన్ 21 మధ్యాహ్నం గం 2—45 కి ప్రసాద్ స్టూడియోలో ప్రారంభించారు శ్రీ జి కామరాజు (పూర్ణా పిక్చర్స్) కెమెరా స్విచ్ ఆన్‌చేశారు మొదటి షాట్‌లో యన్ టి రామారావు, పద్మనాభం, గీతాంజలి పాల్గొన్నారు. శోభన్‌బాబు, వాణిశ్రీ, చంద్రకళ, రేలంగి యితర ముఖ్య భూమికలు పోషిస్తున్న యీ చిత్రానికి ప్రసిద్ధ దర్శకుడు శ్రీ కె. ప్రత్యగాత్మ, సంభాషణలు రాశారు. సంగీతం టి. చలపతిరావు, కథ: వి ఎస్. కృష్ణ


PHONE 440603

VENUS TUTORIAL COLLEGE

53-A USMAN ROAD, T. NAGAR, MADRAS 17.

బెనారస్. ఆంధ్రా మెట్రిక్యులేషన్ తరగతులు

ప్రారంభించబడినవి. వెంటనే అప్లికేషన్, ప్రాస్‌పెక్టసుకొఱకు వ్రాయండి.

Y. RAMOJIRAO, M Ed, Principal



"సాక్షి"లో విజయలలిత, కృష్ణ

చిత్రసమీక్ష

# సాక్షి

ప్రాణి భూమ్మీదకు వచ్చినప్పుడే చావుభయం పుట్టింది. ఈ భయంముందు ఏ భయమూ నిలవదు. ఆత్మరక్షణ కోసం పిల్లి కూడా పెద్దపులిని ఎదిరిస్తుంది!

మంచీచెడూ కలిస్తేనే మనిషి. మనిషిలో మనిషికి పామరసాక్షి 'సాక్షి'!

బాపు బొమ్మ గీశాడు. ప్రజలు సెభాషన్నారు. ఇప్పుడు బొమ్మతీశాడు. ఈ బొమ్మ మామూలుది కాదు. ముళ్లపూడి సహచర్యంతో సర్వాంగసుందరమయిన బొమ్మ. ఈ బొమ్మ ప్రజల ముందుకు వచ్చి సచేతనంగా ఆడుతున్నప్పుడు, సంచలనంగా పాడుతున్నప్పుడు జనం ఏంచేస్తారో మనం చెప్పడం అనవసరం !

'సాక్షి' చలన చిత్రం. చలన చిత్ర రంగానికంతటికీ సంచలన చిత్రం. చిత్రంలో కొత్తదనం లేనిదెక్కడ? కథలోను, చిత్రీకరణలోను, సంగీతంలోను, సాహిత్యంలోను-చివరికి నటీనటుల్లోకూడా! అంతా ఆరుబయట చిత్రీకరణే! అంతాకొత్త సరికొత్త చిత్రం సాక్షి. కొత్తవాళ్ల చిత్రాలు గుత్తదార్లకు గుణపాఠం కావాలి. అందుకు 'సాక్షి' సాక్ష్యం ఇవ్వాలి!

కథలో వైత్తనం చాల చిన్నది. కాని అందులో దృక్పథం చాలా విశాలమైనది.

కిష్టయ్య ఆ వూళ్లో పిల్లిలా వుండేవాడు, అమాయకుడని, వెర్రోడని అందరూ జమకట్టారు. అతన్ని చాటుచేసుకొని, సాక్ష్యం వేసుకుని, వూర్లో పెద్దమనుషులు బోల్డన్ని ఘోరాలు చేశారు. ఫకీరు పెద్దపులి! పెద్దమనుషులంతా కలిసి పిల్లిని పెద్దపులి నోట్లో పడేశారు. సాయంలేని పిల్లి ఎదురు తిరిగింది. ఆత్మరక్షణ కోసం పులిని ఎదుర్కొని జయించింది. పిల్లి (కిష్టయ్య)కి సాక్ష్యం! అక్కరలేదు. ఆత్మనిర్దేశమే అతనికి సాక్షి. ఈ సాక్షాత్కారం మనకు 'సాక్షి'లో కనిపిస్తుంది.

చిత్రం మొత్తంలో అగ్రస్థానం వహించేది ఫకీరు. కోపసహితమైన పాత్రకు లోపరహితమైన జగ్గారావు నటన బాగుంది. కల్లాకపటం ఎరగని కిష్టయ్యపాత్ర ద్వితీయమైనదికాదు. అద్వితీయమైనదే. కానురాను కృష్ణ నటనలో దీటు కనిపిస్తుంది. పాత్రను సజీవంగా దిద్దాడు కృష్ణ. చుక్కపాత్రలో చక్కగా సరిపోయింది విజయనిర్మల. నర్సిగా విజయలలిత నటన బాగుంది.

మునసబుగా రామన్నపంతులు, కరణంగా ఆర్. రంగారావు, పూజారిగా డా. శివరామ కృష్ణయ్య, షావుకారుగా బొడ్డపాటి, మునసబుగారి అల్లుడుగా రాజబాబు, గవరయ్యగా చలపతిరావు, మహాలక్ష్మిగా భారతి నటించారు.

ఆదినుంచి ఆసాంతం పాత్రోచితమయిన ఉచ్చారణ పోషించాలని పాత్రధారులందరూ కృషి చేశారు. ఒక్కోచోట ప్రాంతీయ వాతావరణాన్ని నటీనటులు బాగా అర్థం చేసుకోలేక పోయినట్లు కనిపిస్తుంది. హాయిగా సాగుతున్న చిత్రం అక్కడక్కడా సట్టినా, ఇవేవీ కథా గమనంలో అడ్డురావు.

పటిష్టమయిన కథను, బిగువయిన సంభాషణల్ని ముళ్లపూడి వెంకటరమణ రాశారు. పాటల్ని ఆరుద్ర, దాశరథి కూర్చారు. కెమెరా: పి. యస్. సెల్వరాజ్.

బొమ్మలబాపు దర్శకుడిగా స్థిరపడిపోతారేమోనని జనం అనుకునేటంత సామర్థ్యం ఇందులో కనిపిస్తుంది!

మహదేవన్ సంగీతం ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేస్తుంది. నేపథ్య సంగీతం మనోహరంగా వుంది. పాటలన్నీ వాడవాడలా పాడుకుంటారు!

ఉత్తమమైన ఆదర్శంతో, అడుగడుగునా కొత్తదనంతో ముందుకు నడిచిన 'సాక్షి' బహుజనాదరణ పొందుతుంది. శ్రీఫిలింస్ ద్వారా విడుదలవుతున్న 'సాక్షి' నిర్మాతలు: సురేష్ కుమార్, శేషగిరిరావు.

—సి. కనకాంబరరాజు

## వి వా హం

మీర్జాపురంరాజా, శ్రీమతి క్రిష్ణవేణిగార్ల కుమార్తె చి. సౌ.రాజ్యలక్ష్మి అనూరాధాదేవిని వరంగల్లుజిల్లాకుచెందిన కీ. శే. మెహబూబ్ రెడ్డిగారి కుమారుడు చి. శ్రీనివాసరావుకు ఇచ్చి మద్రాసులోని 'అబట్స్‌బరీ'లో జూన్ 25 వ తేదీన వైభవంగా వివాహం జరిపించారు. పురప్రముఖులు, సినిమారంగానికి చెందిన కళాకారులువచ్చి వధూవరుల్ని ఆశీర్వదించారు.

# "ప్రియా ఇప్పుడు...నీకది నిమిషంలో సాధ్యపడుతుంది లీకోకి కృతజ్ఞతలు"

లీకో-స్వల్పమైన ధర, ఉపయోగించటం తేలిక, పొగలేని
గృహసంబంధమైన వంటచెరకు, ఏ రకమైన వంట పాత్రకైనా తగినట్టిది.



చిన్న లీకో ముక్కలను ఎన్నుకోండి



ఆ ముక్కలను మీ కుంపటిమీద పల్చని పొరలా అమర్చుకోండి.



ఈ లీకో పొరను అంటించండి.



ఆ పొర అంటుకొని మండటం ప్రారంభం కాగానే క్రమంగా లీకోను చేర్చండి.

# లీకో

కాలాన్ని మరియు ధనాన్ని పొదుపు చేస్తుంది.




నైవేలి లిగ్నైట్ కార్పొరేషన్, లిమిటెడ్. నైవేలి-1.

FDS NLC 711 TEL





'అగ్నిపుత్రి' మలయాళ చిత్రంలో షీలా, ప్రేమ్‌నజీర్

చిత్రసమీక్ష

# అగ్నిపుత్రి

చెమ్మీన్ చిత్రంద్వారా మలయాళ చలన చిత్రరంగం ఎంతగా ముందడుగు వేసిందనీ అందరికీ అర్థమైపోయింది. తదాదిగా వారు నిర్మించే చిత్రాలు ఏదో ఒక కొత్తదనంతో తమిళవాళ్లకు మార్గదర్శకమవుతూనే వున్నాయి. ఇప్పుడు మద్రాసులోని అశోక్ థియేటర్‌లో ప్రదర్శిస్తున్న 'అగ్నిపుత్రి' చిత్రం కూడా ఈ కోవకు చెందిందే

ఇందులో కథ సింధు అనే వేశ్యచుట్టూ పరిభ్రమిస్తుంది. ఉన్నతవంశానికి చెందిన అన్నదమ్ముల్లో ఒకరిద్వారా సింధు ఒక అమ్మాయిని కంటుంది అతని తమ్ముడు ఆమెను పెళ్లిచేసుకుంటాడు. 'అన్నగారికీ తమ్ముడికీ పిల్లల్ని కనేంత నీచురాలిని కాను' అని సింధు కళాంతంతో ప్రాణం విడుస్తుంది.

ప్రొఫెసర్ రాజన్ సింధును పెళ్లిచేసుకున్నప్పటినుంచి అయిదురోజుల్లో కథ ముగుస్తుంది. ఏకోణంనుంచిచూసిన ఉత్తమ స్థాయిలో నిలబడే చిత్రం 'అగ్నిపుత్రి.'

ప్రేమ్‌నజీర్, షీలా ముఖ్యపాత్రల్ని ప్రతిభావంతంగా పోషించారు. టి. యస్. ముత్తయ్య, టి. కె. బాలచంద్రన్, వసంత, బేబీ ఉష మొదలైనవారు మిగతా పాత్రలకి ప్రాణం పోశారు.

కథ, మాటలు యస్. యల్. పురమ్ సంధానం రాశారు. సంగీతం: బాబూరాజ్ కూర్చారు. కెమెరా: మణి. యమ్. కృష్ణ నాయర్ దర్శకత్వం వహించిన ఈ చిత్ర నిర్మాత ప్రేమ్‌నవాజ్.

—సికరాజు.

# చిత్రలహరి

భామా విజయం అరవంలో వచ్చింది. తమిళదేశ మంతటా శతదినోత్సవాలు జరుపుకున్నది. ఇపుడా చిత్రాన్ని జెమినీవారు తెలుగులో పునర్నిర్మిస్తున్నారు. గతనెల 23 వ తేదీన పాట రికార్డింగుతో ప్రారంభించారు. 'చల్లని యిల్లు, చక్కని పాపలు—మామంచివారు, మా మామగారు—మా వారూ, శ్రీవారు' అనే యీ పాటను డా. సి. నారాయణరెడ్డి రాశారు. ఎం. ఎస్. విశ్వనాథం సంగీత దర్శకత్వంలో, సుశీల, జానకి, ఎల్. ఆర్. ఈశ్వరి పాడారు. సంతోషం నిండిన ఒక కుటుంబంలోని ముగ్గురు కోడళ్లు కలిసి పాడేపాట. కోడళ్లుగా జానకి, కాంచన, జయంతి నటిస్తున్నారు. మామగారుగా యస్. వి. రంగారావు, సినిమాతార భామగా రాజశ్రీ పాల్గొంటున్న యీ చిత్రానికి భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు రాశారు. తమిళ్రపతికి దర్శకత్వం వహించిన కె. బాలచందర్ తెలుగు చిత్రానికి కూడా దర్శకత్వం నెరపుతున్నారు. ఈరంకిశర్మ అసోసియేట్, కెమెరా: బాలు.

* * *

జెమినీవారి తెలుగుచిత్రానికి సంబంధించినదే మరొక పాట అదీ నారాయణరెడ్డి రచనే 'అక్కి మూరెడు, అక్కబారెడు—చిన



'పూలరంగడు'లో విజయనిర్మల

రికి అప్పులు; చేతికి చిప్పలు' అనేది అ ఖుర్నాడు రికార్డు చేశారు. ఈ పాటను మాధవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వర రావు, ఎల్. ఆర్. ఈశ్వరి బృందం పాడారు. ఇవి ఏ.వి.యం. రికార్డింగ్ థియేటర్‌లో రికార్డు చేశారు.

*　　*　　*

ఏ.వి.యం. వారి ఈస్ట్‌మన్ కలర్‌చిత్రం 'అవే కళ్లు' నిర్మాణం పూర్తికావస్తున్నది. ఒక్క షెడ్యూలులో మాత్రం పని మిగిలి వున్నది. కృష్ణ, కాంచన, రాజబాల, నాగభూషణం, పద్మనాభం, గీతాంజలి, రామదాసు, జయంతి, పుష్పకుమారి, సురేంద్రనాథ్ ముఖ్యభూమికలు పోషిస్తున్నారు. సంభాషణలు: డి. వి. నరసరాజు, పాటలు: దాశరథి, కొసరాజు, సంగీతం: వేదా, కెమెరా: యస్. మారుతీరావు, సహకార దర్శకుడు: సి. వి. సత్యనారాయణ, దర్శకుడు. ఏ. సి. త్రిలోక్‌చందర్ జూలై మాసాంతానికి షూటింగు పూర్తిచేసి అగస్టులో విడుదలచేయాలని అనుకుంటున్నారు.

*　　*　　*

'విన్నది చూడగానె ఏమో అనుకోని హాయి కలిగె' అనే పాటను గతనెల 25 న భాగ్యలక్ష్మి ప్రొడక్షన్‌వారి 'భేతాళ మాంత్రికుడు' చిత్రానికిగాను రాజశ్రీ కాంతారావులమీద చిత్రీకరించారు. ఆరుద్ర రాసిన యీ పాటకు ఎం. ఎస్. ప్రకాష్ సంగీతం సమకూర్చారు. దర్శకుడు: వేదాంతం రాఘవయ్య, ఛాయాగ్రాహకుడు: రెహమాన్.

*　　*　　*

ప్రసిద్ధదర్శకుడు శ్రీ కోవెలమూడి సూర్యప్రకాశరావుగారి ద్వితీయ పుత్రిక చి. సౌ. మంజుల వివాహం జూన్ 29 రాత్రి గం 8-37 కి తేనాంపేట 'అబాట్స్‌బరీ' లో ఘనంగా జరిగింది. వరుడు చి. గోపాలకృష్ణ. వివాహానికి ముందు ఘంటసాల గానకచేరీ, ఆ తర్వాత విందు భోజనం ఏర్పాటు చేశారు.

*　　*　　*

శ్రీ జ్యోతి ప్రొడక్షన్స్‌వారి 'ముగ్గురు మరాఠీలు' చిత్రం రెండవ షెడ్యూలులో పని జరుపుకొంటున్నది వీనస్‌లో. నారాయణరెడ్డి రాసిన 'ఔనా, ఔనా—అనుకున్నది జేస్తున్నది నిజమేనా!' అనే పాటను రాజశ్రీ,



'నవయువతి'లో రవిచంద్రన్, జయలలిత.



"లక్ష్మీనివాసం"లో అంజలీదేవి. భారతి

శోభన్‌బాబులమీద జూన్ 29,30 తేదీలలో చిత్రీకరించారు. దర్శకుడు: పి. సాంబశివరావు, సంగీతం: టి. వి. రాజు.

* * *

శ్రీ విజయభట్‌మూవీస్‌వారి సాంఘిక చిత్రాన్ని జూన్ 30న శారదా స్టూడియోస్‌లో ప్రారంభించారు. యస్.వి రంగారావు, జయలలిత, చంద్రమోహన్, హరనాథ్. వాణిశ్రీ, రామకృష్ణ, రమణారెడ్డి, సూర్యకాంతం ముఖ్యభూమికలు పోషిస్తున్న యీ చిత్రానికి కథ: కె. బాలచందర్ రాశారు. సినిమా అనుకరణ, సంభాషణలు: పాలగుమ్మి పద్మరాజు, పాటలు: పి. నారాయణరెడ్డి, ఆరుద్ర, సంగీతం: కోదండపాణి. కళ: బి. నాగరాజన్. నిర్వహణ: కె. రాఘవులు, కెమేరా: కన్నప్ప, దర్శకుడు: జి. యస్. మూర్తి, నిర్మాతలు :పి. ఏకాంబరేశ్వరరావు, యస్. యస్. భట్.

* * *

అంతా క్రొత్తవారితో, క్రొత్త పోకడలతో 'గొప్పవారి గోత్రాలు' పేరిట ఒక చిత్రం నిర్మింపబడుతున్నది. కుమారి ఇందిర, శేషగిరిరావు నాయకీనాయకులుగా నటిస్తున్నారందులో. సురేఖ, లక్ష్మి, అంజిబాబు, ప్రభాకర్, భానుప్రసాద్, గౌతమ్, జి. యస్. ఆర్. మూర్తి, రాంప్రసాద్, శ్రీనివాసరావు యితర ముఖ్య తారాగణం. ఇటీవల ఈ చిత్రానికి

# చిత్రలహరి

సంబంధించిన అవుట్‌డోరు సన్నివేశాలను అమలాపురం తాలూకాలో చిత్రీకరించి వచ్చారు. దీనితో యీ చిత్ర నిర్మాణం మూడువంతులకుపైగా పూర్తి అయింది. అనేక చిత్రాలకు అసోసియేట్ డైరెక్టరుగా పని చేసిన శ్రీ ఏ. యల్. అప్పారావు యీ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. రచన: అనిసెట్టి, సంగీతం: బ్రహ్మానంద్ (రవి), కెమేరా: అన్నయ్య, కళ: రంగారావు, కథ: వేణు. జూలై మాసాంతంలోగాని, ఆగస్టు ప్రారంభంలోగాని యీ చిత్రాన్ని విడుదల చేయాలనుకుంటున్నారు.

* *

సదానందం చదువు మీద తండ్రి ధర్మయ్యకి నమ్మకం లేదు. అందుకే 'ఒరేయ్, చదువు చాలించి యింట్లోకి నడరా!' అన్నాడు!' ఆయన తూగుటుయ్యాల మీద కూచుని తాపీగా చెప్పాడు. 'ఏమిటి నాన్న స్టైము వేస్టు. క్రైసుకి టైము అయింది' అన్నాడు సదానందం బాధపడిపోతూ. ఇంతలో ఒకమ్మాయి— అబ్బాయి వేషంలో వాళ్ళున్న హాల్లోకి వచ్చి 'ఏమండీ సదానందంగారిల్లు యిదేనా!' అనడిగింది. ఆ అమ్మాయి హేమ. చేతిలో సూట్‌కేస్, కళ్ళకు గాగుల్స్, మరొక చేతిలో స్టిక్, స్లాకూ, పాంటూ'



"అందంకోసం పందెం"లో కాంచన



"పూలరంగడు"లో నాగేశ్వరరావు, జమున

హేటూ—యిదీ వేషం. 'ఔను' అంటూ సదానందం పరధ్యానంగా సమాధానం చెప్పే ఆ గొంతు విని తెల్లబోయాడు. కంగారు పడ్డాడు. ధర్మయ్య ఆ అమ్మాయిని అబ్బాయిగానే భావించి' అవును. ఇది నా యిల్లు. వీడు నా కొడుకు నువ్వెవరి కొడుకువి?' అని అడిగాడు. 'నాన్న, వీడు నా ఫ్రెండ్, మురళి!' అంటూ హేమ భుజం మీద చరిచి 'ఏరా, ఇదేనా రావటం?' అన్నాడు. హేమ చిక్కు మొహం వేసింది — 'కట్' అన్నారు దర్శకుడు కె. హేమాంబరధరరావు. సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఆడపడుచు' చిత్రానికి చెందిన యీ దృశ్యంలో రేలంగి, పద్మనాభం, గీతాంజలి పాల్గొన్నారు. గత నెల 28న సినస్‌లో చిత్రీకరించారు.

—మోహన్ కుమార్

# పుస్తకాలు

### బ్రహ్మజిజ్ఞాస

(ప్రథమభాగం. గ్రంథకర్త: శ్రీ మద్దిబోయిన రామసుబ్బయ్య, క్రౌను 332 పుటలు, వెల రూ 4—50; ప్రాప్తి స్థానం, గ్రంథకర్త శ్రీ పుట్టా— వెంకట రమణయ్య శ్రేష్ఠి., బాదర్‌ఖాన్ మసీదు వీధి, కడప.

ఆయా విషయాల్లో ప్రవేశమూ, ఉత్సాహమూ ఉన్నవారికి తప్ప శాస్త్రీయ గ్రంథాలు జనసామాన్యానికి నచ్చవు. అందులోనూ వేదాంతమంటే భ్రాంతిగా భావిస్తారు. కారణం అందులోని విషయం దురవగాహంగా ఉండడమే. ఇలాంటి విషయాలను సులభమైన భాషలో సుబోధంగా వుండేరీతిని రచించబడిన గ్రంథాలు మన భాషలో అరుదు. అట్టి లోపాన్ని తీర్చడానికి యీ గ్రంథం చక్కగా ఉపయోగించ గలదు.

రచయిత 'ఉపోద్ఘాతం'లో తెలిపిన విషయాలను బట్టి ఆయన పరిశ్రమించి సంస్కృత భాషను నేర్చుకోలేదనీ పెద్దల అనుగ్రహం వల్ల వేదాంత విషయాలు అవగాహన అయ్యాయనీ, తనకు తెలిసిన విషయాలను గ్రంథ రూపంలో పెట్టడానికి భగవదనుగ్రహమే కారణమనీ తెలుస్తున్నది. తాము ఏళ్లతరబడి అనారోగ్యంగా ఉండి అణుమాత్రము ఓపికలేని స్థితిలోనే యీ గ్రంథాన్ని —తాము చెప్తుతూ ఇతరుల చేత వ్రాయించారట! విషయాలన్నీ కరతలామలకాల్లా ఎంతో అనుభవం ఉన్నవారే యిట్టి మహాత్కార్యానికి పూనుకో గలరు. ఈవిషయంలో రచయిత కృతార్థు లయినారనే చెప్పవలసి వున్నది.

శ్రీ రామ సుబ్బయ్య గారు ఈ గ్రంథాన్ని మూడు భాగాలుగా విభజించారు. మొదటి భాగం అద్వైత మత సిద్ధాంతాలను తెలిపేది. రెండో భాగంలో జ్ఞాన, రాజ, కర్మ, భక్తి యోగాలనుగురించి వివరించారట. మూడవ భాగంలో అచల వాదాన్ని గురించి వ్రాశారట. ప్రస్తుత గ్రంథం మొదటి భాగం మాత్రమే. తక్కిన రెండు భాగాలూ అచ్చు కావలసి వున్నవి.

బ్రహ్మ జిజ్ఞాస లోని ప్రథమ భాగరూపమైన యీ గ్రంథంలో మూడు ప్రకరణా లున్నవి. మొదటి ప్రకరణం శీర్షిక ఉపక్రమం. ఇందులో వేదవేదాంగాలు, వర్ణవ్యవస్థ, ధర్మశాస్త్రాలు, ఉపదేశాధికారం, శంకరుల అభిప్రాయం మున్నగు విషయాలను గురించి ఉన్నది. రెండవ ప్రకరణం శీర్షిక 'పరబ్రహ్మము— మాయ' అనేది. ఇందులో అద్వైతం పరుడు, మాయ, జీవేశ్వరుల రూపాలు, వాటివిగూర్చి భిన్నాభిప్రాయాలు, జీవేశ్వరుల అవస్థలు, పంచీకరణం, ప్రపంచోత్పత్తి, సత్‌చిత్‌స్వరూపాలు సుఖదుఃఖాలు, కపిల గౌడపాదాదుల సిద్ధాంతాలు, జ్ఞానాజ్ఞానాలు, విద్యావిద్యలు, మహావాక్య విచారం మొదలైన చాలా విషయాలు రమారమి రెండు వందల పుటల్లో వివరించబడిఉన్నవి. 'సంసారము— ముక్తి' అనే శీర్షికగల మూడవ అధ్యాయం తక్కిన వాటికంటే చాలా చిన్నది. దీనిలో మరణానంతరం జీవుని స్థితి, శ్రాద్ధాదులు, పునర్జన్మ సిద్ధాంతం, సోక్రటీసు సిద్ధాంతం, దేవయాన పితృయానములు, ఉత్క్రాంతి, అధికార పురుషులు మొదలైన విషయాల చర్చలు ఉన్నవి.

ఇందులోని విషయాలన్నీ సామాన్యులకు దురవగాహాలే. అయినా రచయిత వీలగునంత సులభమార్గంలో సరళమైనభాషలో సామాన్యులకు కలిగే సందేహాలను ప్రశ్న రూపంగా చూపి వాటికి తగిన సమాధానాలను శ్రుతిస్మృత్యాది ప్రమాణాలతో వివరించారు. ఇందులోని విషయ వివరణను బట్టి రచయితకు వేదాంతములోని విశిష్ట జ్ఞానం వ్యక్తమగు చున్నది. ఈ గ్రంథాన్ని ప్రశంసించి బ్రహ్మవేత్తలు, విద్వద్వ్రతంసులు ఇచ్చిన సదభిప్రాయాలు అతిశయోక్తులు కావని నిర్ణయించ వచ్చును. శ్రీ రామసుబ్బయ్య గారు తక్కిన భాగాలను కూడా ప్రకటించిన యెడల బ్రహ్మజిజ్ఞాసువులకు ఎంతో ఉపకారం చేసినవారగుదురు.

శాస్త్ర గ్రంథాలలో అచ్చు పొరపాట్లు ఉంటే పఠితలకు చాలా శ్రమ. కొన్ని చోట్ల అపార్థాలకి అవి దారి తీస్తాయి. ఈ పుస్తకం చివర మూడు పుటల తప్పొప్పుల పట్టిక వున్నది. కాని, ఆపట్టికలో చేరని తప్పులు చాలా ఉండిపోయాయి. ముఖ్యంగా సంయుక్తాక్షర, ద్విత్వాక్షరాలలోని క్రింది అక్షరాలు ఎగిరి పోయాయి. మిగిలినభాగాలను ప్రకటించినప్పుడైనా దీని మలిముద్రణంలో నయినా సాధ్యమైనంత వరకు ఈ పొరపాట్లు లేకుండా చూడవలసి ఉన్నది.

—అంగీరస.

### నీళ్ళు

(కథల సంపుటి. రచయిత: శ్రీ పెద్ది భొట్ల సుబ్బరామయ్య. ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2. వెల: రు. 3.00.)

ఈ రచయితకు ఉజ్జ్వల భవిష్యత్తు వుంది. ప్రతికథలోనూ ఒక ప్రత్యేకత వుంది. చక్కని కథ వ్రాసే నేర్పు శ్రీ పెద్ది భొట్ల సుబ్బరామయ్య కలిగి వుండటం, ఈ సంపుటిలోని పదిహేను కథలు చదివిన తర్వాత, పాఠకులు గమనిస్తారు.

కథాశిల్పం రచయితకు చాలావరకు తెలును. రచనా నైపుణ్యం కూడా తెలును. వాతావరణ కల్పనలో నేర్పు వుంది. పురుషపాత్రల రూపరేఖలు, స్వభావాలు స్పష్టంగా చిత్రించటం తెలుసు.

పురుషపాత్రల స్వభావాను గుణ చిత్రణ కథా సంపుటిలో మెరిగుణం. జోగినాథం పాత్రలో దీనత ఎంత చక్కగా కనబడుతుందో, ఉమాపతి, లక్ష్మీపతి పాత్రలలో 'జల్సా' అంత బాగా కనబడుతుంది. శ్రీదేవినే ప్రధానంగా చెబుతూవున్న కుమారస్వామి ఉన్నతత్వమే గోచర మవుతుంది. సారథితో తనన గుండెలు పిండుతుంది. విశ్రాంతి పట్టని గంగాధరంకు విశ్రాంతి పట్టిన వాటి నీతి జీవితంలోంచి పెరికురికిన సత్యం, చంద్రమావృత పరికించిన పార్థసారథిలో అతను పెంచుకొన్న ఆత్మీయత వెనుక అర్థం కాని జీవిత ఘోష దర్శనమిస్తుంది.

పురుష పాత్రలు అనేక కోణాల నుంచి దర్శించి చిత్రించిన రచయితకు స్త్రీ పాత్ర విషయంలో అది సాధ్య పడలేదు. నమామ హృదయం దాటి పోని స్త్రీపాత్ర. అంతే! "మనసు" లోని కూతురూ కోడలూ రేఖా చిత్రాలు! క్షయరోగి భార్య గుట్టు పోవటం తప్ప అస్యం తెలియని స్త్రీ. సరిపూర్ణ వ్యక్తిత్వంగల స్త్రీ పాత్రలు ఈ కథలలో లేవు. శ్రీదేవి తప్ప. ఆమె చక్కని శిల్పాలు. ఈ పాత్ర సృష్టిలో రచయితకు ఇష్ట సిద్ధి!

'భగ్నయోగి' పైనా దుష్ప్రకమణ సందర్భంలో ప్రమాణ్యం వ్రాసిన రచనే అయినా, అప్పసరణుగ తెలుగు వాతావరణం అంది పుచ్చుకొన్న కథానిక!

'కలలో మనిషి' ఒక మధురోహ! ఇలా జరిగితే ఎంత బాగుంటుందీ అనే ఊహకు రూపకల్పన! అయినా మనిషితనం రూపుదాల్చిన రెండు పాత్రల పట్ల సానుభూతితో పాఠకులు ఈ కథ చదివి పరితపించవచ్చు.

'మనసు' లోని రామయ్య, 'మబ్బు విడిచిన ఎండ' లోని ధనంజయరావు వయసు మళ్ళిన పాత్రలు. ఆ పాత్రల చిత్రణ వెనుక పరిపక్వ రచయిత మనస్తత్వం లేదు. యువకుడయిన రచయిత, వృద్ధాప్యం గూర్చి, ఆ పరిస్థితుల గూర్చి, ఎలా ఆలోచించటానికి అవకాశం వుందో, అలాగే రచన సాగింది కాని వృద్ధాప్యం అనుభవించిన రచయిత చిత్రించినట్లు లేవు ఆ పాత్రలు!

వర్ణనలు బాగున్నాయి. ఒనా గమనానికి ఎడనెడ అడ్డుగా కూడా నిలిచాయి. వర్ణనలు కొంత వరకు కవిత్వంలాగా వున్నాయి. కొన్ని వర్ణనలు ఈ రచయితకే ప్రత్యేకం. మరొక రెవరూ ఆ విధముగా చేయని వర్ణనలు— ఈ సంపుటిలో కనిపిస్తాయి.

పునరుక్తి, తక్కువ మాటల్లో చెప్పటానికి వీలున్న విషయ వ్యక్తీకరణకు చాలా పదాలు వాడటం, భావాలు సాగలాగటం వంటివి కొన్ని సంపుటిలో ఎదురవుతాయి.

భావాల మాటున అస్పష్టత్వం కనిపించినా, కథలలో తెలుగు వాతావరణం వుంది. తెలుగు సమాజంలో, ఇళ్ళలో వ్యక్తులలో జరిగిన సంఘటనలు రూపుదిద్దుకొన్న రచనలు చక్కని తెలుగు కథానికలు.

కథా పథకం, పాత్రచిత్రణ, చక్కగా చేయగల ఈ రచయిత కథ నడపటంలో జాగ్రత్త తీసుకోక పోవటం విచారకరం. రచయితకు కుదిరినటువంటి శైలిలేదు. రచన పరిశ్రమ ఫలితంగా కనిపిస్తుంది. సాఫీగా, సరాసరాటంగా సాగలేదు. ఈ లోపం వల్ల కథలకు రావలసినంత ప్రచారం రాకపోవచ్చు ననిపిస్తుంది.

లిట్‌క్విజ్ నెం. 17 లో అన్ని కరెక్టుకు శ్రీ ఎల్. వి. నాటి, K-4, గ్రీన్ పార్కు, న్యూఢిల్లీవారు రు. 11,000 గెలుపొందిరి ప్రవేశపు ఫారం పై వారము ప్రచురించబడును.

LitQuiz no.19
Rs. 25000

ఆఖరు ముగింపు తేది: 27—7—67

ప్రతి మినిక్విజ్ అన్నికరెక్టుకు ఒక మర్ఫీ ట్రాన్సిస్టర్. వివరాలకు లిట్‌క్విజ్ వీక్లీ చూడండి కోరినవారికి ఇటీవలి కాపీ ఉచితంగా పంపబడును. Litquiz Private Ltd; Alankar, Balaram St, Bombay-7 (మీ పేరును, అడ్రసును ఇంగ్లీషులో, పెద్ద అక్షరాలలో వ్రాయండి)

వాయిదాల చెల్లింపు పద్ధతిన ట్రాన్సిస్టర్లు

రు. 255 విలువగల 'ఎస్కార్ట్' 3 బ్యాండ్ ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్‌ను నెలకు రూ. 25/- చెల్లించే పద్ధతిని తెప్పించుకోండి.

RADIO HOUSE (A. P V.)
Sonepat, (Haryana)

కుటుంబ నియంత్రణకు

సత్వరక్షణి

* ఆపరేషన్ భయములేదు. * పురుషులు మాత్రమే యీ ఔషధము సేవించుటకు తయారుచేయబడినది * ఔషధమువలన ఎవ్వటికి సంతానము కలుగక ఆరోగ్యవంతులుగా ఉందురు. * దాంపత్యజీవితమున కెట్టి ఆశా కర్యము ఉండదు. * నరములు పటుత్వము కల్గి మంచి ఉత్సాహమును ప్రసాదించును. * ఔషధము మాత్రం 30 రోజులు సేవించవలెను. * పత్యములేదు. పూర్తి కోర్సు సీసా వెల రు. 10/- పోస్టేజి ప్యాకింగ్ అదనం.

స్వదేశి ఆయుర్వేద ఫార్మసీ,
తెనాలి, (ఆంధ్ర ప్రదేశ్)

# పుస్తక కాలం

'రాళ్ళూ— రత్నాలూ' చక్కని తెలుగు జీవితంతో నేర్పయిన పాత్ర చిత్రణతో కూర్చబడిన కథ. "సీశ్లు"— సీటి చుట్టూ పెరిగే నాగరికత తెలిపే ఉద్దేశ్యంతో సాగిన ఈ కథ రచనలో పటుత్వం సంతరించుకొని వున్నట్లయితే ఆంధ్ర కథా సాహిత్యంలో చాలా మంచి కథ అయి వుండేది.

ప్రత్యేక మయిన శైలి ఏర్పడితే, చదివించే నేర్పుతో వ్రాయటం అలవాటు అయితే, ఈ రచయిత మున్ముందు వ్రాసే కథలు ఆంధ్ర సాహిత్యంలో సముచిత స్థానం పొందుతాయి.

—మనోరాణి.

## వారసుడు

నాటకం. సందేశాత్మకమూ, కళాత్మకమూ అయిన సాహిత్య సృష్టి, రచయిత బల్లోజు బసవలింగం (సువర్ణశ్రీ) ఆదర్శం అన్నారు. రచయిత ఆదర్శంలోనుంచి పుట్టినది వారసుడు నాటకం. ఆరు పురుష పాత్రలతో హాస్యంగా నడిచిననాటకం రక్తి కడుతుంది. నూటపది పేజీల పుస్తకం వెల రెండు రూపాయలు. వి. జి. యస్. పబ్లిషర్స్, అమలాపురం.

## అల్లూరి సీతారామరాజు

నాటకం. 'మధురశ్రీ' రచన. చదివినతరువాత అల్లూరి సీతరామరాజు ఒకనిశ్చయమైన రూపంలో మనకు గోచరిస్తాడు. సంభాషణలు, సన్నివేశాలు బిగిగా వున్నాయి. ప్రదర్శించి, దర్శించి చూడాలి ఈ నాటకాల్లో ఒకటి. పన్నెండు పురుష పాత్రలు రెండు స్త్రీ పాత్రలు ఎనిమిది రంగాలు, 136 పేజీలు ఉన్న పుస్తకం వెల మూడు రూపాయలు ప్రజాప్రచురణలు, ఏలూరు,ఆం. ప్ర.

## బభ్రువాహన

నాటకం. మహావీర బభ్రువాహన నాటకరచయిత కీ. శే. వేదాంతం రామానుజాచార్యులుగారు. ఇతివృత్తంలో మార్పు లేకపోయినా రచనలోనిసౌష్ఠవం తృప్తి వుంది. ప్రశంసలతో పేజీలు పెంచి వెల రు. 2—50 చేసినా పద్యాలతో ప్రజాదరణ పొందుతుంది! ప్రతులకు:'నాట్యకళా విశారద' శ్రీరామ శేషు క్లినిక్, ఉప్పలపాలెము పోస్టు, రేపల్లెతాలూకా, గుంటూరు జిల్లా.

## బసవగీత

గీతాలు. బసవేశ్వరుని కన్నడ వచనాలకు ఆంధ్ర గేయానువాదం. అనువాదకులు శివప్రసాద్. భావ పుష్టి, రసపుష్టి గేయాల నిండుగా వున్నాయి. భక్తితత్వమూ బరువుగా వుంది. 76 పేజీలు పుస్తకం వెల ఒకరూపాయి. ప్రతులకు: మేనేజర్ వి. వి. హాస్టల్, హైదరాబాదు—27.

—సికరాజు

# బంగారు చిలుక

( 23వ పేజీ తరువాయి)

సాహసానికి ఎంతో మెచ్చాను. ఈ స్వర్గాశ్వాన్ని బంగారు చిలకని నువ్వే వుంచుకో. కాని ఆ అందాల రాకుమార్తెని మాత్రం నాకిచ్చెయి.'

రాజు దుర్బుద్ధిని తెలుసుకొన్నాడు వెంకడు. 'సరే, నేను వెళ్ళిపోయేముందు రాకుమార్తె దగ్గర సెలవుతీసుకొని వెళ్తాను.' అన్నాడు. రాజు వప్పుకున్నాడు. వెంకడు వెంటనే స్వర్గాశ్వం మీద కూర్చొని రాకుమార్తె దగ్గరికి వెళ్ళాడు. తన భుజంమీదున్న బంగారు చిలకతో— మహారాజుగారి దగ్గర సెలవుతీసుకొనిరా' అన్నాడు. ఆ చిలక ఎగిరి వెళ్ళి రాజు కళ్ళని పొడిచి వేసింది. వెంకడు రాకుమార్తెని గుర్రంమీద యెక్కించుకొని వాయువేగంతో వెళ్ళిపోయాడు.

పాపం! సువర్ణదత్తుడు గుడ్డివాడై పోయాడు. వెంకడు రాకుమార్తెని వివాహం చేసుకొని, తలిదండ్రుల్నికూడా తీసుకొని మామగారి దగ్గరికి బయలుదేరాడు. దారిలో తన అన్నలిద్దరూ కన్పించారు. పాపం వారు నిద్రాహారాలు లేక చిక్కిశల్యమై వున్నారు. వెంకడు జాలిపడి, వారిని తనతో రమ్మన్నాడు. తర్వాత ఆ చిన్నవాడికి ఎంతో వైభవంగా పట్టాభిషేకం జరిగింది. వెంకడు ఆతర్వాత సువర్ణాధీశ్వర చక్రవర్తిగా పిలువబడ్డాడు. అత్యాసకు పోయినట్లయితే ఆనందం కరువవుతుందనే సత్యాన్ని ఆ దేశం ప్రజలంతా గ్రహించి హాయిగా ఉన్నారు.

ఏజెంట్లు కావలెను

35% కమిషన్ మీద ప్రఖ్యాత ఎస్కార్ట్ ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్‌సిస్టర్లు విక్రయించుటకు ఏజెంట్లు కావలెను. శాంపిలుకై వ్రాయండి.

MANAGER (WAP-55)
P, B. 1115, Delhi—6.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు




# మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మా సమస్య :** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను కనుగొన్నారు – ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి?** మైక్రోఫైన్డ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది :** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోలోని చురుకైన పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రోఫైన్డ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము :** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లలో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి :** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతునొప్పి.

**మోతాదు :** పెద్దవారికి : రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు : ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది... అందువల్ల మీకు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రో బిళ్లలోను ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో', నొప్పిని నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.









మైక్రోఫైన్డ్

'ఆస్ప్రో'

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికొలస్ (N) ఉత్పత్తి

A.G.A.67 TL